## మంచి అవకాశము


87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి
## రియల్ ఎస్టేట్స్
### పుట్టపర్తి

**మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు**
**ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.**

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

***ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.***

**క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు**
**నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"**

ఇట్లు
శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్
**ప్రొ॥ పి. సిద్దయ్య శెట్టి**
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
**ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి**

ఫిబ్రవరి 1998
సంపుటి 14 సంచిక 2

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

Despatched on
**7-2-1998**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం : **ఆంధ్రాతిలక గాడిచర్ల హరిసర్వోత్తమరావు**

# అమృతవాణి

శ్లో॥ ఉత్సాహ సంపన్న మదీర్ఘ సూత్రం
క్రియావిధిజ్ఞం వ్యసనేష్వసక్తం
శూరం కృతజ్ఞం దృఢసౌహృదంచ
లక్ష్మీః స్వయంయాతి నివాసహేతోః ॥

మనిషికి శారీరకబలం కాదు ప్రధానమైంది. సత్కార్య అనుష్ఠానంలో ఆసక్తి ముఖ్యం. ఈ ఆసక్తి లేకపోతే మనిషి ఏ కార్యాన్నీ సాధించలేడు. కార్యసాధన లోని ఆసక్తినే ఉత్సాహమంటారు. వీరానికి కావలసింది ఉత్సాహ శక్తే. ఈ ఉత్సాహం లేనప్పుడు మనిషి బలవంతుడైనా ప్రయోజనం ఉండదు.

అలాగే ఎప్పుడో ముందు ఏదో జరుగుతుందని ఊహిస్తూ కూర్చోవటం సోమరితనమనిపించుకొంటుంది. సోమరి ఏకార్యాన్నీ సాధించలేడు. "శుభస్యశీఘ్రం" అని మంచి పని చేయదల్చుకొన్నప్పుడు వెంటనే చేయటం మంచి లక్షణం, కార్యసాధకుని లక్షణం. మీన మేషాలు లెక్కపెడుతూ కాలయాపన చేయటం కార్యసిద్ధికి ఆటంకం అవుతుంది. కనుక దీర్ఘసూత్రత పనికిరాదు. దానివల్ల పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. మనం ఏ పనిచేసినా కర్తవ్యాన్ని గుర్తించి చేయటం సముచితం. అది ధర్మబద్ధమా ధర్మ దూరమా అని ఆలోచించి చేయాలి. స్వధర్మాన్ని ఆచరించటం బాగా తెలిసికోవాలని తాత్పర్యం. స్వధర్మ నిర్వహణంలో ఎలాంటి ఆటంకాన్నైనా ఎదుర్కోగలిగినప్పుడే ధర్మఫలం దొరుకుతుంది.

మనిషి చెడిపోవటానికి సప్తవ్యసనాలనేవి ఉన్నాయి. మద్యపానం, దొంగతనం మొదలయినవి కూడా యీ వ్యసనాల్లోవే. వీటిని ఏ మనిషీ అలవర్చుకోరాదు. ప్రోత్సహించనూరాదు. ప్రభుత్వమే యీ వ్యసనాలకు అవకాశం కల్పిస్తే అది దేశానికే దౌర్భాగ్యమనాలి. ఈ వ్యసనాల్లో ఏ ఒక్కటి ఉన్నా మనిషి చెడిపోవటం ఖాయం. ఇక ఎక్కువ ఉంటే చెప్పవలసిందేముంది.

కనుక బుద్ధిమంతుడెన్నడూ ఈలాంటి వ్యసనాల జోలికి పోరాదు. మనిషికి శౌర్యం కవచం వంటిది. అధర్మం మీద దండెత్తాలి. శూరుడైతేనే ధర్మగ్లాని సహించడు. ధర్మగ్లాని దేశం పాడై పోవటానికి కారణం. అలాగే మనకెవరైనా ఉపకారం చేస్తే వాళ్ళను, వాళ్ళ ఉపకారాన్ని మరచిపోకూడదు. పదిమందిలో ప్రకటించి, కృతజ్ఞత చూపించాలి.

ఇదే విధంగా మన స్నేహం కూడా నిష్కపటమై ఇతరులకు ఆత్మీయతను పంచాలి. మనస్సులను కలిపి ప్రేమను పెంచేది స్నేహమొక్కటే. అది కూడా తాత్కాలిక స్నేహం కారాదు. దృఢమైనది కావాలి. ఈ విధంగా ఉత్సాహం, అదీర్ఘసూత్రత, స్వధర్మజ్ఞానం, ఎలాంటి వ్యసనాలు లేకపోవటం, శౌర్యమూ, కృతజ్ఞత, గట్టి స్నేహ భావం ఈ మొదలయినవన్నీ ఉన్నచోట లక్ష్మి తనంతట తానే వచ్చి నిలకడగా ఉంటుంది.

ఇలాంటి సద్గుణ సంపన్నుడైన వ్యక్తిని సంపద తనంతట తానే వరిస్తుంది.

- కూచిభట్ల చంద్రశేఖర శర్మ

# సుభాషితములు

"ప్రదోషే దీపకశ్చంద్రః
ప్రభాతే దీపకో రవిః
త్రైలోక్యే దీపకో ధర్మః
సుపుత్రః కులదీపకః"

రాత్రి యందు వెలుగునిచ్చువాడు చంద్రుడు. ఉదయమున (పగలు) వెలుగునిచ్చువాడు సూర్యుడు. ముల్లోకములకు వెలుగునిచ్చెడిది ధర్మము. కులమునకు కీర్తి దెచ్చువాడు మంచి కుమారుడు.

## ఆంధ్రా తిలక్ ఆదర్శజీవి

# గాడిచర్ల హరిసర్వోత్తమరావు

ఆంధ్ర దేశంలో స్వాతంత్ర్యోద్యమ వైతాళికులుగ, ప్రప్రథమ ఆంధ్ర రాజకీయ ఖైదీగా, విజ్ఞానవేత్తగా, నిష్కామ నిరాడంబర ప్రజాసేవకులుగ, సమోజన విద్యాపితా మహులుగ విఖ్యాతులైన దేశభక్తులు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు.

లోకమాన్య బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్ర పాల్, లాలాలజపతిరాయ్‌లచే ప్రభావితులైన హరి సర్వోత్తమరావుగారు విద్యార్థి దశలోనే 'వందేమాతరమ్' ఉద్యమంలో సమరోత్సాహంతో దూకిన యువశక్తి గాడిచర్ల వారు.

బెంగాల్ సింహం, బిపిన్ చంద్రపాల్ జాతీయ సమర శంఖారావం పూరిస్తూ 1907 ఫిబ్రవరి రాజమండ్రి వచ్చారు. బిపిన్ గారి ఉపన్యాస ఝురిలో తలమునకలై గోదావరి తీరంలో దేశ దాస్యవిముక్తి కోసం కంకణం ధరించిన గాడిచర్లవారు, మరుసటి రోజు వందేమాతరమ్ బ్యాడ్జితో, విద్యార్థిగా ఉండిన రావుగారు టీచర్స్ ట్రైనింగ్ కాలేజికి వెళ్ళారు. ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ ఆగ్రహో దగ్రుడై బ్యాడ్జిని తీసివేయమని ఆదేశించాడు. 'తీసివేయను' అన్నాడు. కాలేజినుండి బహిష్కరింపబడినాడు. హరి సర్వోత్తమరావుగారికి ప్రభుత్వ సంస్థలలో కాని, స్థానిక సంస్థలలోకాని ఉద్యోగమివ్వరాదని ప్రభుత్వం నుండి నిషేదాజ్ఞలు జారీ చేయించాడు మార్క్ హంటర్.

అప్పటికి గాంధీజి భారతరాజకీయాల్లో లేరు. జవహర్‌లాల్ ఊసే లేదు. ఆంధ్ర దేశంలో మొట్టమొదటి స్వరాజ్య సమరయోధులు గాడిచర్లవారే.

### స్వరాజ్య పత్రిక :

జాతీయోద్యమ ప్రచారానికి సాధనంగా పత్రికను వెలువరించాలన్న దీక్షతో 1908లో శ్రీ బోడి నారాయణరావు సహకారంతో 'స్వరాజ్య' తెలుగు వారపత్రికను ప్రారంభించారు. తెల్లదొరల అక్రమ చర్యలను తీవ్రంగా ఖండిస్తూ సంపాదకీయాలు వ్రాసేవారు.

### జైలుజీవితం :

1908లో తిరునల్వేలిలో, ఆష్ అను ఆంగ్లేయ అధికారిని విప్లవకారులు కాల్చి చంపారు. ప్రజల తిరుగుబాటును అణచి వేసేందుకు పోలీసులు జరిపిన కాల్పులలో ముగ్గురు అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. రావుగారు 'విపరీత బుద్ధి' అన్న శీర్షికతో సంపాదకీయం రాస్తూ అధికారుల దమనకాండను తీవ్రంగా దుయ్యబట్టారు. రావుగారిపై రాజద్రోహం నేరం మోపి మూడేళ్ళ కఠిన కారాగార శిక్ష విధించారు. రావుగారి జైలు జీవితాన్ని గురించి వర్మ చెంచయ్య గారు 'నేనూ-నాదేశం'లో ఇలా చిత్రించారు.

### జానమద్ది హనుమచ్ఛాస్త్రి

"ఎం.ఏ., పట్టభద్రులైన హరిసర్వోత్తమరావు గారిని నెల్లూరు సెంట్రల్ జైలు బందిపోటు దొంగలు, హంతకులు ఉన్న గదిలో బంధించారు. మానరక్షణకు రెండు గోచీలు ఇచ్చారు. మూరెడు చదరం గల రెండు తువ్వాళ్ళు, పడుకునేందుకు చిన్న ఈత చాప, అన్నం తినడానికి మట్టి చట్టి, నీళ్ళు త్రాగడానికి మట్టి ముంత, మలమూత్రాదులకు మరో చట్టి ఇచ్చారు. కాలికి లావాటి కడియం, మెడకు మరో కడియం వేసి ఒక కొయ్య ముక్కను వీటిలో దూర్చారు. మొలతాడు, జందెం తీసి పారవేశారు. తలబోడి చేయించారు. రాగి సంకటి ముద్ద, దానిలో రాళ్ళు, పుల్లలు, పురుగులు తేలుతుండేవి. ఈ యాతనను మూడేళ్ళు అనుభవించారు. జైలును చూడవచ్చిన గవర్నర్‌ను ఖైదీలను మానవులుగా చూడమన్నందుకు దుర్భాషలాడి వెళ్ళి పోయాడు.

రావుగారు, తిలక్, అనిబిసెంటుగార్లు స్థాపించిన హోంరూల్ లీగ్ ఆంధ్రశాఖకు కార్యదర్శిగా రాష్ట్రమంతటా పర్యటించి ప్రజలను ఉత్తేజపరచారు. ఆయన మహావక్త.

1927లో గాడిచర్లవారు కాంగ్రెస్ అభ్యర్థిగా నంద్యాల నియోజక వర్గంనుండి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నుకోబడి రాయలసీమ సమస్యల పరిష్కారానికి ఎంతగానో పోరాడారు. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు ప్రారంభించిన 'విజ్ఞాన చంద్రిక' గ్రంథమండలి కార్యదర్శిగా, ఆ సంస్థ ప్రచురించిన మొదటి గ్రంథం అబ్రహాంలింకన్ చరిత్ర రచించారు. రాజమండ్రి లోని టీచర్స్ ట్రయినింగ్ కాలేజిలో విద్యార్థిగా ఉన్నపుడే ఆ ప్రాంతంలో 100మందితో రాత్రి బడులను నిర్వహించారు. పంచాయతీ మహాసభ, సహకార సంఘాల సభ, ఉపాధ్యాయ మహాసభ మున్నగువాటికి అధ్యక్షులుగా పనిచేశారు. మద్రాసులో పాకీ పని వార్ల సంఘానికి, ప్రెస్ కార్మికుల సంఘానికి నాయకత్వం వహించారు.

1930లో రాజకీయరంగంనుండి స్వచ్ఛందంగా వైదొలగి, గ్రంథాలయోద్యమం, వయోజన విద్యారంగంలో అవిశ్రాంతంగా కృషిచేశారు. సమైక్య ఆంధ్రావతరణ కోసం కృషి చేశారు.

1950లో అవిభక్త మద్రాసు రాష్ట్రప్రభుత్వం శ్రీరావుగారిని వయోజన విద్య డైరక్టరుగా నియమించారు.

## స్వార్థ రహితుడు

మోహమైన జూపించి మురిపించి పొమ్మను
ముక్కోటి వేల్పుల ముద్దు దీర్ప
కలనైన గనుపించి కరుణించ గోరెడు
ముద్దుగోపికలతో ముచ్చటాడ
కర్తవ్య మెరిగింప కదలి రమ్మని వేడు
మౌని వర్యుల తోడ మాటలాడ
వేణుగానము కాస్త వినిపించమని కోరు
గోమాలను జూచు కోర్కెమీద
నిండు మనసుతోడ నిత్యంబు సేవించి
భక్త జనుల వెంట పరువులిడగ
మనసు పడుటెగాని - తనమాట దల్పని
స్వార్థ రహితుడోయి - సత్యసాయి!

శ్రీగాడిచర్లవారు బళ్ళారిజిల్లాలోని కన్నడ తాలూకాలో పదిరోజులపాటు, గ్రంథాలయాలను, వయోజన విద్యా కేంద్రాలను దర్శిస్తూ, గ్రామాల్లో తెలుగులో చేసిన ప్రసంగాలను కన్నడంలోనికి అనువదించే మహద్భాగ్యం నాకు లభించింది.

### కళలకు ప్రోత్సాహం :

సామాన్యప్రజల్లో కళలపట్ల, సాహిత్యంపట్ల అభిరుచిని పెంచేందుకు నాటకోత్సవాలను జరిపారు. 1928లో నంద్యాలలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభలో దత్తమండలాన్ని, రాయలసీమగా నామకరణం చేయునట్లు తీర్మానింప చేశారు.

గాడిచర్లవారు 'ఆంధ్రపత్రిక' అనే దినపత్రికకు మొదటి సంపాదకులు. తాడిపత్రిలో మాతృసేవ పత్రిక స్థాపనకు సంకటి కొండారెడ్డిగారిని ప్రేరేపించారు. నంద్యాలలో కైప సుబ్రహ్మణ్యశర్మగారితోపాటు 'కేమోదక' పత్రిక స్థాపించారు. 1921లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలోగాంధీజీ ప్రతిపాదనలలోని లోపాన్ని ఎత్తి చూపినందుకు గాంధీజీ నుంచి ప్రశంసలనందుకున్నారు. తమ 'యంగ్ ఇండియా' పత్రికలో 'దిబ్రేవ్ హరిసర్వోత్తమ రావు' అంటూ మహాత్ముడు ప్రశంసించాడు.

బీదకుటుంబంలో జన్మించిన రావుగారు ఏనాడూ ఏ పదవికీ ప్రాకులాడలేదు. హరిసర్వోత్తమరావుగారు 14-9-1983 న కర్నూలులో జన్మించారు. వారి పూర్వీకులు కడపజిల్లా సింహాద్రిపుర గ్రామకరణాలుగా ఉండేవారు. తండ్రి వెంకటరావుగారు రెవెన్యూ ఉద్యోగిగా పనిచేసి కర్నూలులో స్థిరపడినారు.

కీర్తిప్రతిష్టల నాశించక త్రికరణశుద్ధిగా దేశసేవ చేసిన గాడిచర్లవారిని ప్రభుత్వం విస్మరించింది. విజయవాడలోని గ్రంథాలయ సంఘానికి గాడిచర్ల వారి పేరు పెట్టారు. కర్నూలులోని జిల్లాగ్రంథాలయ భవనానికి వారి పేరు పెట్టారు. ఆంధ్రదేశంలోని అన్ని ఉద్యమాలకు శ్రీకారం చుట్టిన గాడిచర్లవారి సేవకు తగిన స్మృతిచిహ్నం నిర్మించుట ప్రభుత్వ కర్తవ్యం కాదా?

సంక్రాంతి సందేశం

# ప్రేమ లేని జీవితం మరుభూమి

"దాక్ష్య మేకపదం ధర్మం
దానమేక పదం యశః
స్వర్గమేక పదం సత్యం
శీలమేక పదం సుఖమ్."

దేనికైననూ యోగ్యత అత్యవసరం. ధర్మమునకును యోగ్యత చాలా అవసరం. యోగ్యతను పురస్కరించుకొనియే మానవుడు ధర్మములో ప్రవేశిస్తుంటాడు. మానవుడు కీర్తిని సంపాదించవలెననిన ఒక విధమైనటువంటి యోగ్యత అవసరం. దానము చేతనే మానవుడు కీర్తిని సంపాదించ గలడు. సత్యము చేతనే స్వర్గమును కూడనూ సాధించ వచ్చును. గుణమే మానవుని సర్వసుఖములకునూ మూల కారణం. కనుక సుఖమును పొందవలెననినను, స్వర్గమును పొందవలెననినను, కీర్తిని సంపాదించ వలెననినను యోగ్యత అత్యవసరం.

ఈనాటి పర్వదినం అనాది కాలము నుండి భారతీయులను ఉత్సాహ ప్రోత్సాహ భరుస్తూ వస్తున్న దినం. ప్రతి పర్వదినం సంఘము యొక్క శ్రేయస్సును పురస్కరించుకొని ఏర్పరచినటువంటిదే. ఈ పర్వదినము భారతీయులకు అత్యంత ప్రధానమైనటువంటిది. ఇది సూర్యుని యొక్క ప్రభావం చేత ఏర్పడినటువంటి దినం. సూర్యుడు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క రేఖపైన ప్రవేశిస్తూ ఉంటాడు. కాని ఈ మకరంలో ప్రవేశించినటువంటి సూర్యుని ప్రభావం ఉత్తర దిశయందు ప్రయాణమవుతూ ఉంటుంది.

**"దినకరుడు శాంతుడై తోచె**
**దినములింక కురుచనై చలిగాలి చురుకుహెచ్చె**
**పొలములన్ రేని గ్రుడ్డి వెన్నెలలోన**
**కుప్పలనూర్చు కాపులు గొంతులెత్తి**
**పదములన్ పాడదొడగుదురు**
పచ్చ పూవులు జనపచేలకు
ముత్యాల సగుకు గూర్చె
మిరపపండ్లకు కుంకుమ మెరపుదాల్చి
బంతిపూల మొగములల్లంత విప్పి
మన గృహముల ధాన్య సంపదల నింపి
సరసురాలైన సంక్రాంతి పండుగొచ్చె"

## భగవాన్ సాయి దివ్య బోధ

ప్రతి మానవుని హృదయము నందు షడ్ చక్రములు అనే పేరుతో సూర్యుడు ప్రకాశిస్తూ ఉంటాడు. ఇందులో ప్రధానమైనటువంటివి రెండు. 1. హృదయ చక్రము. 2. సహస్రార చక్రము. ఈ హృదయ చక్రమునకు ఎనిమిది దళములు ఉంటాయి. కనుకనే దీనిని "అష్టదళ స్వరూపము" అన్నారు. ఈ అష్టదళములకు అధిపతి సూర్యుడు. అతనే సూర్యరూపములో ప్రకాశించి ప్రపంచమునకు సమస్తమును చేకూర్చేటటువంటి భగవంతుడు. సూర్యుడే లేకుంటే జగత్తేలేదు. సమస్త సృష్టి సూర్యుని నుండియే ఆవిర్భవిస్తున్నది. కనుక సూర్యుడు భగవత్ స్వరూపుడు. ఈ అష్ట దళములు అష్ట భూభాగములుగా విభజించారు. ఈ అష్టభూభాగములను మానవుడు సాధించవలెననిన దైవానుగ్రహం కోసం తగిన కృషి చేయాలి. పూర్వము మహర్షులు, యోగులు ఈ అష్టదళములైనటువంటి హృదయాన్ని ఆధారము చేసుకొనియే సహస్రారములో ప్రవేశించి సంతోషాన్ని అనుభవిస్తూ వచ్చారు.

ఈ 'సహస్రారము' అనేటటువంటిది వెయ్యి దళములతో కూడినటువంటిది. హృదయకమలము అష్ట దళములతో కూడినటువంటిది. ఈ సహస్రార దళము (వెయ్యి దళములు)లలోని ఒక్కొక్క దళమునందు షోడశ

కళలు (16 కళలు) ఉంటున్నాయి. దానిని ఆధారము చేసుకొనియే భగవంతుడు పదహారు కళలతో నిండినటువంటివాడని భాగవతం ప్రభోధిస్తుంది. ఒక్కొక్క దళము 16 కళలతో కూడినపుడు ఈ వెయ్యి దళములు 16వేల దళములు అవుతాయి. కనుక ఈ పదహారు వేల దళములను గోపికలనియు, ఈ అష్టదళములను కృష్ణుని రాణులనియు చెప్పారు. 'గుప్' అనే ధాతువు నుంచి 'గో' అనే పదము ఏర్పడినది. 'గో' అనగా వేదము అని ఒక అర్థము. రెండవ అర్ధము ఆవు. మూడవ అర్ధము భూమండలము. నాల్గవ అర్ధము వాక్కు. కనుక 'గో' అనే పదమునకు నాలుగు విధములైన అర్ధములు చెప్పబడినాయి. కనుక వేదములు ఉచ్చరించినటువంటి వారు గోపికలు. గోవులను రక్షించినటువంటివారు గోపికలు. భూమిని పోషించినటువంటివారు గోపికలు. వాక్కు చేత భగవత్ స్వరూపాన్ని నిరూపించినటువంటి వారు గోపికలు. కనుకనే " శబ్ద బ్రహ్మమయీ, చరాచరమయీ" అని వర్ణిస్తూ వచ్చారు గోపికలు.

"క్లీం, కృష్ణాయ, గోవిందాయ, గోపీజన వల్లభాయ, స్వాహ" అని గోపికలు వర్ణిస్తూ వచ్చారు. ఈ ఐదు పదములను, విభజించి, వారు ఏవిధంగా అర్ధములు స్వీకరించారో కొంత విచారించాలి. 'క్లీం' అనగా భూమి, 'కృష్ణాయ' అనగా జలము. 'గోవిందాయ' అనగా అగ్ని. 'గోపీజనవల్లభాయ' అనగా వాయువు. 'స్వాహ' అనగా ఆకాశము. అనగా పంచభూత స్వరూపుడే భగవంతుడు. ఈ పంచభూతములు లేకుండా జగత్తేలేదు. సర్వత్రా ఈ పంచభూతములున్నాయి. సర్వవ్యాపకమైనటువంటివి ఈ పంచ భూతములు. కనుక భగవంతుడులేని స్థానమంటూ లేదు. ప్రతి అణువు నందు, ప్రతి కణము నందు, ప్రతి క్షణమునందు కూడను చిద్రూపుడైనటువంటి భగవంతుని స్వరూపాన్ని మనం సాక్షాత్కరింపజేసుకోవాలని ప్రబోధించారు గోపికలు. కనుక ఏ అణువునందు చూచిన, ఏ కణమునందు చూచిన, ఏ క్షణమునందు విచారించినా దైవత్వమే మనకు సాక్షాత్కరిస్తుంది. దీనిని పురస్కరించుకొనియే భగవద్గీత.....

"సర్వతః పాణిపాదం
తత్సర్వతోక్షి శిరోముఖం
సర్వతః శ్రుతిమల్లోకే

అని అన్నది. కనుక భగవంతుడులేని అణువుగాని, కణంగాని, క్షణంగాని లేదు. ఈ విధంగా మనం విచారం చేస్తూ వచ్చినప్పుడు మన యొక్క సహస్రార పద్మము అనేది శిరస్సు నందు ఉంటున్నది. ఈ తెలివి తేటలను మనం సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. ఆనాటి యోగులు ఈ మేధాశక్తిని హృదయం ద్వారా ప్రవేశపెట్టారు. అయితే ఈనాటి వారు హృదయాన్ని విస్మరించి, కేవలం తెలివితేటలచేతనే జీవిస్తూ వస్తున్నారు. ఈనాటి విద్యలన్నీ కేవలం మేధాశక్తి మీదనే ఆధారపడి ఉంటున్నాయి. కనుక ఇలాంటి మేధాశక్తి నిరుపయోగమైనటువంటిదని నిరూపిస్తూ వచ్చారు.

**"సద్గుణంబులు, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ కర్తవ్యపాలనములు నేర్పునదె విద్య"** అన్నారు.

ఇవన్నియూ హృదయము నుండియే ఆవిర్భవిస్తూ వచ్చాయి. అసలు అష్టదళములు అనేటటువంటివి ఏమిటి? 1. ప్రేమ. 2. సత్యము. 3. సహనము. 4. శాంతి. 5. త్యాగము 6. దయ. 7. అందము. 8. ఆనందము. ఈ ఆనందమనేటటువంటిది దైవస్వరూపాన్ని మనం పొందాలనుకుంటే ఈ అష్టదళములయందు మనం ప్రవేశించాలి. భగవంతుడు ప్రేమస్వరూపుడు. అతను ఒక దళమే. భగవంతుడు సత్య స్వరూపుడు, సహన స్వరూపుడు, శాంత స్వరూపుడు, త్యాగ స్వరూపుడు, దయాస్వరూపుడు, అంద స్వరూపుడు. అతని స్వరూపమే అందము. ఈ అందము చేతనే ఆనందము. దీనికి త్యాగమే మూలము. కనుకనే వేదము నందు

**"నకర్మణా నప్రజయా
ధనేన త్యాగేనైకే
అమృతత్వ మానశుః** అని చెప్పబడింది.

ఇలాంటి ఆనంద నిమిత్తమై, ఆనాటి చకోర పక్షులు ఎన్ని విధముల శ్రమలు పడ్డాయో చక్కగా

విచారించాలి. స్వాతిజలం కోసమే నిరీక్షించాయి ఈ చకోర పక్షులు. ప్రపంచంలో జలమునకు కొరతలేదు. సముద్రమూ జలమే. కాని ఈ ఉప్పు నీరును అవి ఆశించలేదు. మలిన జలమును ఆశించలేదు. స్వచ్ఛమైనటువంటి నిర్మలమైన జలమునే ఆశించాయి. కేవలం ఆకాశము నుండి పడే జలమునే గ్రోలి సంతృప్తి బడేవి. నీలమేఘశ్యాముడైన భగవంతుని దృష్టిలో పెట్టుకొని, నీలమేఘములను చూచి భగవంతుడేనని భావించేవి. నీల మేఘములను చూచి అవే కృష్ణుడని భావించేవి. సర్వ దృష్టిని భగవంతుని మీదనే లక్ష్యంగా పెట్టుకొని జీవిస్తూ వచ్చేవి. కనుక అదే విధంగా ప్రతి మానవుడు దేనిని చూచినా, దేనిని విన్నా, దేనిని అనుభవించినా అంతా దైవమేనని భావించాలి. నీవు చదివే చదువులు, ఆడే ఆటలు, పాడే పాటలు, వినే శ్రవణం - సర్వము కూడనూ భగవంతుని శబ్దములుగానే భావించాలి. కనుక Life is a Game, Play it అన్నారు. ఈవిధంగా ప్రతి జీవియందు దివ్యమైనటువంటి ప్రేమతత్త్వము ఇమిడి ఉండాలి. ఈ ప్రేమ చేతనే దైవత్వాన్ని మనం ఎంతైనా అనుభవించవచ్చును. **ప్రేమలేని జీవితం మరుభూమి వంటిది.** ప్రేమతో కూడినటువంటి జీవితమే నిజమైన జీవితం. ఈ ప్రేమ చేతనే మనం సత్యమును సాధించవచ్చును. సత్యమేక పదం స్వర్గం. సత్యము చేతనే స్వర్గమును కూడా పొందారు. కనుక సత్యమును ప్రేమ చేతనే సాధించాలి. ఈ సత్య ప్రేమల సమ్మిళిత స్వరూపం చేతనే మనం ధర్మమును అనుసరించాలి. ఈ ధర్మమును దాన మార్గంలో ప్రవేశపెట్టాలి. దీనిని బుద్ధుడు ఆధారం చేసుకొని 'ధర్మం శరణం గచ్ఛామి' అన్నాడు. అయితే ఈ ధర్మం ఎక్కడ నుంచి వచ్చింది? "బుద్ధం శరణం గచ్ఛామి" అన్నాడు. ఈ బుద్ధిని సంఘంలో ప్రవేశపెట్టాలిగనుకనే 'సంఘం శరణం గచ్ఛామి' అన్నాడు. ధర్మమును బుద్ధిలో ప్రవేశపెట్టి, బుద్ధిని సంఘంలో ప్రవేశపెట్టాలి. దీనినే భారతీయులు 'త్రికరణశుద్ధి' అన్నారు. హృదయము, వాక్కు, కాయము - ఈ మూడింటి యొక్క ఏకత్వమే దివ్యత్వము. ఇలాంటి దివ్యత్వాన్ని ఆనాడు పోషించుకుంటూ వచ్చారు.

మొట్టమొదట శీలం (Character) ప్రధానమన్నారు. ఈ శీలము (Character) లేకుండా ఎంత ధనమున్నా, ఎంత బలమున్నా ప్రయోజనం లేదు. "If Character is Lost, Every thing is Lost. If Health is Lost Something is Lost. If Wealth is Lost Nothing is Lost" అన్నారు. ప్రాచీనులు అటువంటి పవిత్రమైన భావంతో నడిచారు. ఈనాడు ఏమైంది? If Wealth is Lost Every thing is Lost" అయింది. అంతా తల్లక్రిందులైంది. ఇదే ఈనాటి ఆధునిక విద్య ఫలితం. మన జీవితానికి ప్రధానం Character. సద్గుణములు ప్రధానం.

అష్టదళములే భగవంతుని రాణులు. ఈ అష్టదళములు ఆధారం చేసుకొని సహస్రారము వరకు మనం ప్రయాణం చేయాలి. హృదయాన్ని ఆధారం చేసుకొనకుండా, కేవలం సహస్రార పద్మములో ప్రవేశించడానికి వీలుకాదు. ఈ పన్నెండు నెలలలో, పన్నెండు రాసులలో సూర్యుడు ప్రవేశిస్తుంటాడు. అందులో ఈ మకరరేఖ పైన ప్రవేశించిన సూర్యుడు, ఆరునెలలపాటు ఉత్తరాయణంలో ఉంటాడు. ఈనాడు సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించిన దినం. ఉత్తరాయణంలో నా ప్రాణాలు వదలాలని భీష్ముడు ప్రతిజ్ఞ పట్టాడు. అంపశయ్య పైన శయనించిన భీష్ముడు 56 దినములపాటు ఈ ఉత్తరాయణ కాలం కోసం నిరీక్షిస్తూ వచ్చాడు. ఇంత పవిత్రమైన దినంలో దివ్యభావములు మనం పెంచుకోవాలి. ఈ అష్టదళములు కూడనూ భగవంతుని యొక్క షోడశ కళలతో నిండినటువంటివిగా మనం తీసుకోవాలి. ఈ విధమైన భావములు అంతరార్థంగా తీసుకొని, ఆనాటి ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించినటువంటి వారు గోపికలు. ఎవరి సేవ చేసినప్పటికినీ అది భగవత్ సేవగా భావించుకుంటూ వచ్చారు. భగవంతుడు ఒక మందిరంలోగాని, ఒక మసీదులోగాని, ఒక చర్చిలో గాని లేడు. ఎక్కడ ఉన్నాడు? మానవుని హృదయమునందే ఉంటున్నాడు. అటువంటి సర్వవ్యాపకుడైనటువంటి, సర్వ హృదయవాసి అయినటువంటి భగవంతుని మరొక ప్రదేశమునకు పోయి వెతుకనవసరం లేదు. కనుక నీ హృదయమే భగవంతుని

మందిరం. అయితే ఈనాడు భగవంతుడు 'హృదయవాసి' అంటే ఎవరూ విశ్వసించడం లేదు. సత్యాన్ని విశ్వసించడం లేదు. అసత్యాన్ని విశ్వసిస్తున్నారు. 'సత్యం జనవిరోధాయ, అసత్యం జనరంజనం' అయింది. ఈనాడు సత్యాన్ని ఎవరూ విశ్వసించడం లేదు. అసత్యం చాలా ఆకర్షణగా ఉంటున్నది. మద్యం ఊరుబయట అమ్ముతున్నప్పటికినీ, ఊరు వదిలి అక్కడికి పోయి త్రాగుతారు. పాలు, పెరుగు ఇంటింటికి తెచ్చి పాలు కావాలా? పెరుగు కావాలా? అంటే వద్దు పొమ్మంటున్నారు. ఈనాటి విద్యార్థుల పరిస్థితి కూడ ఆ విధంగానే ఉంటున్నది. విదేశాల విద్యలంటే ప్రాకులాడు తున్నారు. భారత దేశంలో ఉన్న విద్యలాంటి విద్య మరే దేశంలోను లేదు. సర్వ విద్యలకు మూలాధారం భారతదేశం. అట్టి భారతదేశమునందు ఎట్టి విద్యలైనా మనం అభ్యసించవచ్చును. ముఖ్యంగా జీవితమును సార్థకం గావించేటటువంటి విద్యలను మనం అభ్యసించాలి. జీవితం సార్ధకం కాని విద్యలు ఎన్ని నేర్చి ప్రయోజనం ఏమిటి?

**"ఎన్ని విద్యలు నేర్చియు నేమి ఫలము**
**తన్నొసట వ్రాత తప్పింపనెవరితరము**
**చెడ్డబుద్ధులు తన తల జేరెనేని**
**ఎండబారును బుద్ధులు బెండుబారు."**

ముఖ్యంగా మన బుద్ధులు సరిగా లేనప్పుడు, ఎన్ని విద్యలు నేర్చి ఏమి ఫలము? కనుక మొట్టమొదట ఆత్మ విద్యను మనం నేర్వాలి. అదియే విశ్వాసం. ఆత్మ విశ్వాసం (Self Confidence) అత్యవసరం. ఆత్మ విశ్వాసం లేనటువంటి వాడు ఎన్ని విద్యలు నేర్చినప్పటికినీ, అదంతా కేవలం ధన నిమిత్తమే అవుతుంది. విదేశాలకు వెళ్ళినటువంటివారిని 'అయ్యా! నీవు భారతదేశం వదలి ఎందుకు ఈ దేశం వచ్చావ్?' అని విదేశీయులు ప్రశ్నిస్తుంటారు. 'నీవు ధనం కోసం వచ్చావు. ధనసంపాదనకు పాటుపడు. అంతేగాని మిగతా విషయాలు మాట్లాడవద్దు' అని నోరు మూయిస్తారు. ఈనాడు మన విద్యలు ఈవిధంగా అధోగతికి జారిపోతున్నాయి. విదేశాలలో పదివేలు సంపాదించేకన్నా మన భారతదేశంలో పది రూపాయలు సంపాదిస్తే చాలు.

**"పంటపండని భూమి పది ఎకరములేల**
**కొంచెమైన చాలు మంచి భూమి"**

అన్నారు. అదే విధంగా "గంగిగోవు పాలు గరిటెడైనను చాలు" అన్నారు. పవిత్రమైనటువంటి quality ని పెంచుకుంటూ రావాలి. ఎందుకు ఈ quantity? చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లలు విదేశాలకు పోవాలని, డబ్బు సంపాదించాలని కోరిక. ఏమిటి ఈ సంపాదన? భారతదేశంలో సంపాదించిన గుణపోషణ, విదేశాలలో ఏమాత్రం రాదు. మనకు గుణం ప్రధానం, ధనం కాదు. దివ్యమైన, నవ్యమైనటువంటి ప్రవర్తనను గురించి ఒక్క భారతదేశంలో మాత్రమే ప్రబోధించబడు తున్నది. పిచ్చి వాంఛలతో మనం పరుగెత్తిపోతున్నాం. ఎండమావులను చూచి పరిగెత్తినట్లుగా పరిగెత్తుతున్నాం.

నారదుడు భక్తి భావమును ప్రబోధించాడు. అసలు 'నారదుడు' అనగా తంటాలమారి అనుకుంటున్నారు. కాదు.... కాదు. నరులకు నారాయణుని చూపించినటువంటివాడు 'నారదుడు'. నర, నారద, నారాయణ - ఈ మూడింటియొక్క ఏకత్వాన్ని ప్రబోధించినటువంటివాడు 'నారదుడు.' దివ్యత్వంతో కూడినటువంటివాడు 'నారదుడు'. మహాజ్ఞాని నారదుడు. దుర్గుణములను మార్చి సద్గుణములలో ప్రవేశపెట్టినటు వంటివాడు 'నారదుడు'. కుత్సితమైన భావములను నేర్చి, వారికి, వీరికి కొన్ని జగడాలు పెట్టించేటటువంటివాడు కాదు నారదుడు. అంతరార్థము తెలియనివారు ఈవిధంగా పదములను అపవిత్రము చేస్తున్నారు. జ్ఞానస్వరూపుడు నారదుడు. నరత్వాన్ని నారాయణత్వంలో ఏకత్వం గావించినటువంటివాడు నారదుడు. నరుడే నారాయణుడు అనే భావాన్ని ప్రబోధం చేసినటువంటివాడు నారదుడు. ఏకత్వాన్ని దివ్యత్వంగా మార్చినటువంటివాడు నారదుడు. అనేకత్వంలోని ఏకత్వాన్ని నిరూపించినటువంటివాడు నారదుడు. ఇట్టి పవిత్రమైన జ్ఞానమును ఈనాడు మానవుడు అర్థం చేసుకొనలేకపోతున్నాడు. ఈనాడు ఏకత్వాన్ని, అనేకత్వంగా విభజించేటటువంటి మేధావులు అనేకమంది ఉన్నారు. కాని అనేకత్వాన్ని, ఏకత్వంగా చూపించేటటువంటి గుణవంతులు చాలా తక్కువ. కనుక

మనం అనేకత్వాన్ని, ఏకత్వంగా తీసుకోవాలి. ఉదాహరణకు ఇది తల, ఇది చేయి, ఇది కాలు, ఇది పొట్ట - ఇవన్నీ ప్రత్యేకించి వివిధ అంగములు. ఇన్ని అంగములు చేరినటువంటిదే ఈ దేహము. అనేక అంగములతో కూడినటువంటిది దేహము. ఈ దేహము సమాజంలో ఒక భాగము. ఈ సమాజం దేనికోసం వచ్చింది? సమాజం ఏకత్వం కోసం వచ్చింది. దీనికి ప్రకృతి ఆధారము. ఈ ప్రకృతి ఏ అంగము? ఇది భగవంతుని అంగము. ఈ దేహమే లేకపోతే ప్రకృతే మనకు లేదు. కనుకనే 'శరీరమాద్యం ఖలు ధర్మసాధకం' అన్నారు. ధర్మాన్ని ఆచరించాలి. ధర్మమనగా ఏమిటి? మనస్సు, వాక్కు, కాయము - ఈ మూడింటి యొక్క ఏకత్వమే ధర్మము. ఈ ఏకత్వము యొక్క దివ్యత్వాన్ని అనుభవించినటువంటివాడే నిజంగా సాక్ష్కాత్కారము పొందినటువంటివాడు.

సాక్షాత్ + ఆకారము = సాక్షాత్కారము. అది ఏమిటి? భగవంతునికి ఏదో ప్రత్యేకమైన రూపం ఉన్నదా? సర్వరూపములు, సర్వనామములు తనవే. ప్రత్యేకమైనటువంటి రూపం లేదు. అందువలననే "నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్యశుద్ధ, బుద్ధ ముక్త నిర్మల స్వరూపిణం'' అన్నారు. అన్ని రూపములు భగవంతునివే, అన్ని స్థానములు భగవంతునివే. ఆ భావమును మన హృదయంలో చిత్రించుకున్నప్పుడు, సర్వమూ ఏకత్వంగా రూపొందుతుంది.

సూర్యుడు ఆరునెలలు దక్షిణమార్గంలోను, ఆరు నెలలు ఉత్తర మార్గంలోను సంచరిస్తాడు. ఈనాడు ఉత్తర మార్గంలో ప్రవేశిస్తాడు. ఉత్తరమార్గమనగా ఉత్తమమైన స్థానము. ఉత్తర దిశన హిమాలయ పర్వతమున్నది. ఈశ్వరుని యొక్క స్థానము హిమాలయం. హిమ+ అచలము= హిమాచలము. హిమమనగా ఏమిటి? హిమమనగా ఐస్ (మంచుగడ్డ). 'ఐస్' అనగా పవిత్రము. శుద్ధంగా ఉంటుంది. శుద్ధమే కాదు చల్లగా ఉంటుంది. 'అచలము' అనగా స్థిరము. నిర్మలమైన, అచలమైన, భావమే నీ హృదయము. ప్రశాంతమైన హృదయము నిర్మలమైన హృదయము, అచలమైన హృదయమే 'హిమాచలము'. మనం హిమాచలానికి ప్రయాణమై పోనవసరం లేదు. మన యొక్క బుద్ధిని హృదయం వైపుకు మరల్చాలి. అదియే హిమాచల ప్రయాణం. అక్కడనే ఈశ్వరుడు ఉన్నాడు. హృదయవాసి ఈశ్వరుడు. అలాంటి హృదయమునందు ఉన్నటువంటి ఈశ్వరతత్వాన్ని విస్మరించి, ఎక్కడో బయట ప్రదేశంలో ప్రవేశించి, ఏదో అచలమైనటువంటి, చలనము లేనటువంటి విగ్రహాలను పూజిసస్తూ వాటిపైన ఆశలు పెంచుకుంటున్నాము. అచలములో చలము ఉంటున్నది. చలములో అచలము ఉంటున్నది. మన దేహం జాగ్రదావస్థలో సంచరిస్తూ ఉంటుంది. దీనిలో ఉన్నటువంటి ప్రాణశక్తి సర్వత్రా ప్రవేశిస్తుంటుంది. కాని నిద్రావస్థలోపల ఈ దేహము ఒక బెడ్‌పైన పడిఉంటుంది. కాని నీ మనసు సర్వత్రా సంచరిస్తూ ఉంటుంది. అచలములో చలము ఉంటున్నది. చలించనటువంటి దేహము లోపల చలించేటటువంటి మనసు ఉంటున్నది. కనుకనే అచలములోని చలము, చలములోని అచలము అన్నారు. దీనిని పురస్కరించుకొనియే భగవద్గీతయందు 'క్షేత్ర క్షేత్రజ్ఞ చాతిమాన్ బుద్ధి' అదికూడనూ నేనే అన్నాడు. క్షేత్రమూ నేనే. క్షేత్రజ్ఞుడను నేనే. కనుక దేహమూ భగవంతుడే, దేహి భగవంతుడే. కనుక దేహమును కూడా మనం అలక్ష్యం చేయకూడదు. దేహమును కూడా సార్ధకం గావించుకునేటటువంటి పనులలో ప్రవేశపెట్టాలి. పవిత్రమైన కర్మలు మనం ఆచరించాలి. దైవమునకు ప్రీతికరమైనటువంటి పనులు మనం చేయాలి. సమాజమునకు చెడ్డపేరు తెచ్చే పనులు మనం చేయకూడదు. నీవు సమాజంలో ఒక సభ్యుడవు. సభ్యులు చెడిపోతే సమాజము చెడిపోతుంది. సొసైటికి మంచి పేరు రావాలంటే వ్యక్తులు మంచివారై ఉండాలి. కనుక సొసైటీ బాగోగులు వ్యక్తుల మీద ఆధారపడి ఉంటుంది. సమాజం మారాలని ఉపన్యాసాలిస్తే ప్రయోజనం లేదు. మొట్టమొదట నీవు మారాలి. వ్యక్తి మారినప్పుడే సమాజం మంచిదవుతుంది. మొట్టమొదట నీవు మంచివాడవు కాకుండా సొసైటీని మంచి చేయాలంటే ఎలా సాధ్యమవుతుంది? మొట్టమొదట నీవు మంచివాడిగా తయారుగా! నీ హృదయాన్ని పవిత్రమైన దానిగా మార్చుకో! అప్పుడు నీవు సొసైటీని పవిత్రమైన దానిగా మార్చగలవు.

మాట యిచ్చి తప్పుకోకూడదు. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవాలి. హరిశ్చంద్రుడు దానధర్మాలు చేస్తూ వచ్చాడు. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవటానికోసం రాజ్యాన్ని త్యాగం చేశాడు. కట్టకడపటికి తన భార్యా బిడ్డలను కూడా త్యాగం చేశాడు. కాటికాపరిగా చేరాడు. పడరాని కష్టములు పడ్డాడు. అయినప్పటికీ చలించలేదు. అందువలనే 'సత్యహరిశ్చంద్రుడు' అని గొప్ప శాశ్వతమైన పేరును సంపాదించాడు. కనుక ప్రతి ఒక్కరూ తాను తరించి, ఇతరులను తరింపజేయాలి. అప్పుడే జీవితం సార్ధకమవుతుంది.

విద్యార్థులారా! మీరు అనేక ఆటలలో పాల్గొనినారు. వీటికి మీకు ప్రైజులు యిస్తారు. ఏ ప్రైజు మీకు చాలా ముఖ్యం? వారు వీరు యిచ్చే ప్రైజులు మీరు అంగీకరించకూడదు. Self Satisfaction (ఆత్మ సంతృప్తి) అనేదే ముఖ్యమైన ప్రైజ్. దానికి మించిన ప్రైజు వేరొకటి లేదు. నేను నా కర్తవ్యమును చక్కగా నిర్వర్తించినాను. నా డ్యూటిని నేను చేశాను అనే సంతృప్తి ఉండాలి. Duty is God, Work is Worship.

మీ వార్డెన్సు వచ్చి పిల్లలకు బహుమతులు యివ్వాలని కోరారు. ఈ బహుమతులు యివ్వడానికి నా మనసు అంగీకరించలేదు. ఒక్క 'మతి' ఉన్న మానవుడే ఇన్ని అవస్థలకు గురియైపోతున్నాడు, 'బహుమతులు' యిస్తే వాడికి యింకా ఏగతి పడుతుందో! ఒక్క కోతి ఉన్నప్పుడే ఎంత అల్లరి జరుగుతుందో! అందులో "బ్రహ్మచారి శతమర్కటః" బ్రహ్మచారి నూరు కోతులతో సమానమట! కనుక అలాంటి బహుమతులు యివ్వటానికి నాకు ఇష్టంలేదు. అయితే ఏవిధమైన బహుమతి యివ్వాలి? " Your are Good... You are Good" అని నా నోటినుంచి రావాలి. బహుమతి వస్తే స్వామి పాద నమస్కారం లభిస్తుందని చాలామంది పిల్లలు భావిస్తుంటారు. కాని బహుమతులు విసర్జించటం చేత నిన్న అందరికీ పాదనమస్కారం యిచ్చేశాను. 'త్యాగేనైకే అమృతత్వమానశుః' ఆ త్యాగము చేతనే మీకు యింత అవకాశం చిక్కింది. కనుక మొట్టమొదట Self satisfaction ఉండాలి. ఆ satisfaction కు ముందు Self confidence (ఆత్మవిశ్వాసం) ఉండాలి. బిల్డింగుకు పునాది ఉండాలి. పునాది లేకపోతే నిలువదు, పడిపోతుంది. కనుక Self confidence (ఆత్మవిశ్వాసం) అనేది foundation (పునాది). Self satisfaction (ఆత్మ సంతృప్తి) అనేది wall (గోడ). Self sacrifice (స్వార్ధ త్యాగం) అనేది roof (కప్పు). Self realisation (ఆత్మ సాక్షాత్కారము) అనేది life (జీవితం). కనుక పునాది, గోడ, కప్పు - ఈ మూడు ఉన్నప్పుడే మనిషి జీవితానికి భద్రత ఉంటుంది. ఆత్మ సాక్షాత్కారమునకు ఆత్మ విశ్వాసం పునాది. విద్యార్థులారా! ఈ పవిత్రమైన భావాలను హృదయంలో నింపుకొని, ఈ ప్రపంచంలో ప్రవేశించి, ప్రతి వీధి, ప్రతి వాడవాడ ఈ ఆధ్యాత్మిక తత్త్వమును చాటుతూపోవాలి.

ఈనాడు ప్రపంచం చాలా అల్లకల్లోలంగా ఉంటున్నది. ఎక్కడ చూచినా అశాంతి, ఎక్కడ చూచినా భయమే. ఈ భయం, అశాంతిని దూరం చేయాలంటే, దైవభక్తిని ప్రతి ఒక్కరికీ చాటుతూ పోవాలి. ఈనాడు ప్రపంచంలో చాలామంది పేరు ప్రతిష్ఠల కోసం ప్రాకులాడుతున్నారు. ధనార్జన కోసం తాపత్రయపడుతున్నారు. ఇది మంచిదికాదు. Money comes and goes, But morality comes and grows. మీరు Morality ని పెంచుకుంటూ రావాలి. మీ పనులు మీరు చేసుకుంటూ, గ్రామాలలో సేవలు చేయండి. ఎవరో గ్రామీణులకు సేవ చేస్తున్నామని మీరు భావించకండి. ఆరూపంలో ఉన్న భగవంతునికి సేవ చేస్తున్నామని భావించండి. ఎవరికి సేవ చేస్తున్నా భగవంతునికే చేస్తున్నామనే భావమును పెంచుకోండి. "పరులు పరులు కాదు పరమాత్ముడగునయా!" పరులు అనే భావం నీలో నుంచి పోవాలి. ప్రతివాడు పరమాత్ముడే అనే భావం పెంచుకోవాలి. దైవత్వంలేని జీవత్వం ఎక్కడా కానరాదు. కొందరు వాదించవచ్చును. కాని తన సత్యమును తాను ఏమాత్రం వదలలేదు. ఏ నమ్మకమూ లేనివాడు ఏదో కొన్ని కష్టసమయముల లోపల వచ్చి 'My God' అంటాడు.

ఒక చిన్న ఉదాహరణ. ఒకానొక సమయంలో పండిత నెహ్రూ మధురమీనాక్షి దేవాలయంకు వెళ్లాడు.

విలువైన పచ్చను మీనాక్షి మెడలో చూచాడు. దీనివెల ఎంత?, అని అడిగాడు నెహ్రూ. ఆయన పచ్చయొక్క విలువను చూశాడు. రూపమును ధరించిన మీనాక్షిని చూచారు మిగతా భక్తులు. వాళ్ళు దివ్యత్వంతో చూచారు. ఈయన లౌకికంతో చూచాడు. ఇది చాలా లక్షలు అవుతుందన్నారు పూజారులు. 'Oh My God' అన్నాడు. ఈ God ఎక్కడనుంచి వచ్చింది? తనయందుకూడా God ఉన్నాడు. ఏదైనా పడేటప్పటికి ' Oh my God' అంటారు. ఈ విధంగా మనలో ఉన్నటువంటి దివ్యత్వం మనకు తెలియకుండానే ఆవిర్భవిస్తుంటుంది. ప్రతి మానవుని యందు దివ్యత్వం ఉంటూనే ఉంటుంది. ముఖ్యంగా అంత్యసమయంలో ఇవన్నీ బహిర్గతమవు తుంటాయి. ప్రతి ఒక్కటి కూడనూ మానవుని యొక్క ప్రతిబింబములే.

ఒక చిన్న ఉదాహరణ. పాండవులు 12 సంవత్సరములు అరణ్యావాసం చేశారు. ఒకనాడు కృష్ణుడు వారి యోగక్షేమాలను విచారించడానికి అరణ్యాలకు వెళ్ళాడు. అప్పుడు అక్కడ ఒకరాత్రి ఉన్నాడు. రాత్రంతా పాండవులు తలా ఒక గంట కాపలా కాస్తున్నారు. అప్పుడు "ధర్మజ! నాకూ ఈ సేవ చేయడానికి అవకాశం యిస్తావా?' అని అడిగాడు కృష్ణుడు. అప్పుడు "లోక సంరక్షకుడివి నీవే! పాండవ సంరక్షకుడివి నీవే గదా! చేయండి స్వామి!' అన్నాడు ధర్మజుడు. అయితే "ఈ అడవిలో ఒక పెనుభూతం ఉన్నది. అది మిమ్ములను ఏమైనా శ్రమింప చేస్తుందేమో, కనుక మీరు వద్దులే!" అన్నాడు ధర్మజుడు. అప్పుడు "ధర్మజా! నేను దైవము అనే సత్యమును నీవు గుర్తించి ఉంటే ఈ పెనుభూతము నన్ను ఏమి చేయగలదు? నీకు ఈ సందేహం ఎందుకు కల్గింది. అది నీబలహీనత" అన్నాడు కృష్ణుడు. వెళ్ళాడు.. ఆ రాత్రి రెండు గంటల నుంచి మూడు గంటల వరకు కాపలా కాశాడు కృష్ణుడు. తరువాత అర్జునుడు డ్యూటీలో ప్రవేశించాడు. ఒకరాతిపై కూర్చుని కృష్ణుడు నవ్వుతున్నాడు. అక్కడ దైవమూ లేదు, భూతమూ లేదు. అప్పుడు అర్జునుడు "కృష్ణా! ఈ భూతాన్ని ఏమైనా మీరు సంహరించారా?" అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు "నేను సంహరించనక్కరలేదు. అది దైవము కాదు, భూతము కాదు, పిశాచము కాదు" అప్పుడు మనయొక్క reflection, reaction, resound మాత్రమే. మన భయము, మన క్రోధము మన శత్రుత్వమే ఈ విధమైన రూపాన్ని ధరిస్తుండాలి. దానిని సంహరించాలి అనే భావం మనలో పెరుగుతున్న కొద్దీ, దాని స్వరూపం కూడా పెరుగుతూ ఉంటుంది. దానిపై క్రోధము లేదు. అది నా అంశము అనే భావంతో నేను ఆనందిస్తున్నాను. కనుక అది నా మీద ఏమాత్రం కోపించలేదు. కనుక మన ద్వేషమే మన ఎదుట పెద్ద దయ్యంగా నిలుచుంటున్నది. మన క్రోధమే మన ఎదుట పెద్ద శత్రువుగా నిలుస్తుంటుంది. మనకు శత్రువులు ఎవ్వరూ లేరు. మనకు ద్వేషులు ఎవ్వరూ లేరు. మన గుణములే మన శత్రువులు, మన గుణములే మనకు ద్వేషులు. That is the reflection of the inner being. మనలోని భావాలే బయట ప్రతిబింబిస్తూ ఉంటాయి. ద్వేషమనేది లేకుండా నీలో ప్రేమను అభివృద్ధి పరచుకుంటే నీముందు నీ ప్రేమ అనే స్వరూపమే వస్తుంది. కనుక ద్వేషమూ, అసూయలను పెంచుకోకూడదు. వాటివలన నీకే నష్టం. 'తన కోపమే తనకు శత్రువు, తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరకము" అన్నారు. నీవు ఎప్పుడూ ఆనందంగానే ఉండు. నీవు ఎప్పుడూ ఆనందాన్నే అనుభవిస్తావు. నీవు శాంతి స్వరూపుడుగానే ఉండు. నీవు సర్వమూ శాంతినే అనుభవిస్తావు. ఎవరిపైనైనా ద్వేషాన్ని సాధించాలనుకున్నప్పుడు, మనలో కూడా ద్వేషం పెరుగుతూ వస్తుంది. ఈ సత్యాన్ని పాండవులకు బోధించాడు కృష్ణుడు. అప్పటి నుంచి పాండవులు ద్వేషమును త్యజించారు. ద్వేషమును త్యజించడం చేతనే పాండవులు విజయాన్ని సాధిస్తూ వచ్చారు.

భగవద్గీత మొదటి శ్లోకములోని మొదటి పదము 'ధర్మ'. ఆఖరి శ్లోకములోని ఆఖరి పదము 'మమ' "మమ, ధర్మ" ఇదే భగవద్గీత చెప్పింది. "నీ ధర్మాన్ని నీవు ఆచరించు." అదే భగవద్గీత సారము. మొదటి పదము, ఆఖరి పదము యొక్క ఏకత్వమే భగవద్గీత స్వరూపము. వందశ్లోకాలను కంఠస్థం చేయడమనవసరం. ఈ రెండు పదముల సారమును ఆచరిస్తే చాలు. ఎవరెవరి ధర్మాన్ని

వారు అనుసరిస్తూపోతుంటే అంతకంటే గొప్పది మరొకటిలేదు. హృదయ ధర్మము అనేది అందరికీ సమానమైనటు వంటింది. నీ హృదయంలో ప్రేమను నింపుకొని నిరంతరమూ వెలితి లేకుండా చూచుకోవాలి. ప్రేమ హృదయాన్ని నింపుకొన్నప్పుడు, ఎంతైనా సాధించవచ్చును. కనుక............

START THE DAY WITH LOVE
SPEND THE DAY WITH LOVE
FILL THE DAY WITH LOVE
END THE DAY WITH LOVE
THIS IS WAY TO GOD

ఈ విధమైన పద్ధతిలో జీవితాన్ని గడుపుతూ రావాలి.

ఒక్కొక్క Campus కు ఒక్కొక్క Silver Cup యిస్తున్నాను. దానిని హృదయకప్పుగా భావించుకొని, ఇదే అందరికి యిచ్చిన బహుమతిగా భావించుకొని ఆనందించండి. ఇది ఏదో ఒక సంస్థకు ఇచ్చారని భావించకండి! ఇది నాకే యిచ్చారని, నాకే యిచ్చారని ఎవరికి వారు భావించుకోండి. దీనిలో ప్రతి ఒక్కరికి హక్కు ఉన్నది. ప్రతి ఒక్కరూ Fundamental Love ను పెంచుకుంటూరావాలి. Individual Love చాలా సంకుచితమైనటువంటిది. నీవు, నేనూ, వారు అందరం చేరి ఒక్కటే అనేటటువంటి ఏకత్వం రావాలి. We and We all are one. అయితే ఈనాడు ప్రపంచమంతా భిన్నత్వంలో చేరిపోయి, అనేకత్వంగా విభజించుకొని, అనేక విధముల అశాంతికి గురియైపోతున్నది. విద్యార్థులంతా ఆ ప్రపంచంలో ప్రవేశించి అనేకత్వాన్ని ఏకత్వంగా మార్చడానికి ప్రయత్నించాలి. అదియే మీరు సాధించవలసినటువంటిది. నాకు యివ్వవలసినటు వంటిది. ఎందుకంటే మీరందరూ నా ఆస్తి. నేను మీ ఆస్తిని. నన్ను మీరు పంచుకోండి! మిమ్ములను నేను పంచుకుంటాను. అదియే నిజమైన భక్తికి మార్గం. భక్తి.......... భక్తి అని ఏదో పూజలు, వ్రతములు చేసుకుంటూ పోతే గాదు. దైవము నావాడు......... దైవము నావాడు...... అనే హక్కును మీరు సాధిస్తూ రావాలి. అప్పుడు దైవము నా వాడు అనుకున్నప్పుడు, మీరు నావారు అని నేను అనుకుంటాను. కనుక నన్ను మీ వారుగా భావించుకోండి! సహజంగా మీరు నావారవుతారు.

గొప్ప పేరున్న క్రికెట్ క్రీడాకారుడు "ఏ పని చేసినా నా స్వామి పనే అని చేస్తున్నాను. నేను స్వామి పని చేస్తుంటే, నా పని స్వామి చేసుకుంటూ వచ్చారు. నా వరకు నా పని ఏమీ చేసుకోలేదు. ఇక్కడికి వచ్చిన తరువాత నీ పని విజయమైంది అని ఒక టెలిగ్రాం వచ్చింది. అని కుర్చీ మీద కూర్చున్న తరువాత "స్వామీ! నేను స్వామి పని చేశాను. స్వామి నా పని చేశాడు" అన్నాడు, కనుక స్వామి పనులు మీరు చేయండి. మీ పనులన్నీ నేను చేసుకుంటాను. ప్రతి కర్మ దైవకర్మగానే భావించి చేయండి. మన Action అంతా లోపల ఉన్నటువంటి ప్రాణతత్వంతోనే వచ్చేటటువంటిది. ఈ Reaction, Reflection, Resound - ఇవన్నీ కూడా ఒక్క దైవము నుండి ఆవిర్భవించేటటువంటివే. అదే Divine Vibration. ఆ Divine Vibration నీయొక్క జీవితానికి తగిన ఆధారం చేకూరుస్తుంది. ●

*(ది. 14-1-1998న సాయి కుల్వంత్, ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి యిచ్చిన సంక్రాంతి సందేశము నుండి)*


## శ్రీవాణి పోషకులు



**Smt. V. Suseela**
**Sri V.V.S. Rama Sarma**
Principal, Zonal Training Centre, LIC,
MUMBAI

హిమాలయ ప్రాంతంలో ఉన్న పవిత్ర క్షేత్రాలలో ఉత్తర కాశి ఒకటి.అక్కడ విష్ణుమహరాజ్ అనే జ్ఞాని ఉండేవారు. ఒకసారి ఆయన దగ్గరకు ఒక యువసన్యాసి వచ్చాడు. నాకు కొన్ని సందేహాలున్నాయి. మీదగ్గర వాటిని తీర్చుకోవాలనివచ్చాను అన్నాడు ఆ యువ సన్యాసి, దిగంబరంగా ఉన్న విష్ణుమహరాజ్‌ను చూడగానే తనలో కలిగిన కంపరాన్ని అణచుకొంటూ. గురువును అడిగే పద్ధతి ఇదేనా?ముందు ప్రణామం చేయి! అన్నాడు విష్ణుమహరాజ్. ఆ తరువాత సాధువు ముందు సాష్టాంగ పడటం అంటే యువసన్యాసికి ససేమిరా మనస్కరించలేదు. వెళ్ళిపోయాడు. తరువాత ఆయన ఎందరో యోగులను కలిసి తన సందేహాలను వ్యక్తం చేశాడు. అంతా నీ ప్రశ్నలకు జవాబు చెప్పగలవాడు విష్ణుమహరాజొక్కరే అంటూ వచ్చారు. దాంతో ఆయన విష్ణుమహరాజ్ దగ్గరకు రాబోవటం, సాష్టాంగ సమస్య గుర్తుకు వచ్చి వెనుతిరిగి పోతుండటం జరిగేది. విష్ణుమహరాజ్ మౌనంగా ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు.

ఒకరోజు ఆ యువ సన్యాసి తన వేపు కొంత దూరం వచ్చి, తిరిగి వెనక్కువెళ్ళబోతుండగా ఆయన అతడిని పిలిచారు.భోంచేశావా?అనడిగారు. అతడు లేదని చెప్పగానే కూర్చోబెట్టి భోజనం వడ్డించారు. అతడు భోజనం చేయగానే ఇక వెళ్ళు నాకు పనిఉంది, అన్నారు. నాకు భోజనం ఎక్కడన్నా దొరుకుతుంది కాని నా సందేహాలకు సమాధానాలు దొరకవు. అందుకు మీరొక్కరే సమర్థులు, అన్నాడు సన్యాసి. అందుకు మహరాజ్ చిరునవ్వు నవ్వారు. సమాధానాలు పొందే మానసిక పరిపక్వత నీకింకారాలేదు. అది వచ్చినపుడు నీవు కోరుకున్నది లభిస్తుంది, అన్నారాయన. మర్నాడు సన్యాసి మహరాజ్ వద్దకు మళ్లీ వచ్చాడు. వినయంగా ఆయనను సమీపించి సాష్టాంగ ప్రణామం చేశాడు. స్వామీ నా అవినయాన్ని మన్నించి, నా సందేహాలు తీర్చుకొనే యోగ్యత నాకనుగ్రహించి, సమాధానాలు తెలియజేయండి. అని అర్థించాడు. విష్ణుమహరాజ్ అందుకు సంతోషంగా అంగీకరించి అతని ప్రశ్నలన్నింటికీ తగిన సమాధానాలు చెప్పి సంతృప్తి కలిగించారు.

- భండారు పర్వతాలరావు

# భారత స్వాతంత్ర్య స్వర్ణోత్స వేళ మృతవీరుల సంస్మరణ

స్వాతంత్ర్య వీరులు సాగు చేసిన నేల
పరికింపసాపర పండ్లు పండె
స్వాతంత్ర్య వీరుల ఖ్యాతి వెల్గిన చోట
స్వార్ధ పరత్వమ్ము వ్యాప్తి చెందె
స్వాతంత్ర్య వీరుల సమరాంగణమ్మున
పందలూ బలగుంపు ప్రభవమొందె
స్వాతంత్ర్య వీరుల శాంతి సౌధములోన
ఘోరదురంతాల గుంపుచేరె
భరతవీరుల ప్రాణాలు బలియొనర్చి
తెచ్చి యిచ్చిన స్వాతంత్ర్య దివ్య దీప్తి
వెలిసిపోజొచ్చెవి ద్రోహములను నేడు
కటకటా! చూడదురదృష్టకరముగాదె

ఇళ్ళూ వాకిళులమ్మి ఇల్లాలి పిల్లల
వీధి పాల్జేసిన యోధులార
ఉన్న ఆస్తులనెల్ల నుద్యమమ్ములకిచ్చి
కీర్తినిల్పిన త్యాగమూర్తులార!
ఉప్పుసత్యాగ్రహోద్యోగమ్మునను చెర
సాలపాలైనయో సాధులార!
పోలీసుకాల్పుల కాలూని యెదురొడ్డి
ఱొమ్ము చూపిన రౌద్రరుద్రులార!
ధరణి దద్దరిల్ల నుఱికంబములనెక్కి
మాతృరుణము దీర్చు మాన్యులార!
పరమ పురుషులార ! భారత స్వాతంత్ర్య
సమర వీరులార ! శాంతి, శాంతి.

-ఇక్కుర్తి ఆంజనేయులు

# ముక్తి ఎవరికి, ఎందుకు? ముక్తి అంటే ఏమిటి?

**బంధాయ విషయాసంగః - ముక్త్యైనిర్విషయం మనః ।**
**మన ఏవ మనుష్యాణాం - కారణం బంధమోక్షయోః ॥**

అంటూ బంధమునూ, మోక్షమునూ గూర్చి చాణక్యుడు తన నీతి దర్పణంలో వివరించారు. (13వ అధ్యాయం - 11వ శ్లోకం)

"మనస్సు విషయములతో కలిసి ఉండటమే బంధం. మనస్సు విషయములను విడనాడటమే ముక్తి. కనుక బంధమోక్షములకు రెంటికీ మనస్సేకారణం" అంటారు నీతిదర్పణంలో చాణక్యులు!

రుచికరమైన ఆహారపానీయాలు జిహ్వాకు విషయాలు. సుందరదృశ్యాలు నేత్రాలకు విషయాలు. శ్రావ్యమైన పలుకులు, (సం)గీతాలు చెవులకు విషయాలు. సుగంధ పరిమళద్రవ్యాలూ, పరిమళాలూ ముక్కుకు విషయాలు. అదే రీతిగా మృదువైన, సుఖకరమైన స్పర్శను కలిగించేవన్నీ చర్మానికి విషయాలు.

అయితే నోటితో తినకుండా, కంటితో చూడ కుండా, చెవులతో వినకుండా, శరీరంతో స్పర్శ సుఖం లేకుండా, ముక్కుతో పీల్చకుండా మనిషేకాదు, జంతువులూ, క్రిమికీటకాలు కూడా బ్రతుకలేవు. కానీ ఆకలి తీర్చుకోవటం కొరకే తినాలనీ, మంచి దృశ్యాలనే చూడాలనీ, మంచినే వినాలనీ, శరీరాన్ని ఎంతవరకు సంరక్షించుకోవాలో అంతవరకే దానికి గల సుఖాన్ని పరిమితం కావించాలనీ, సుగంధాలతోటే ఆనందించక, స్వచ్ఛమైన ప్రాణవాయువును క్రమబద్ధంగా ఒక వ్యాయామంలాగా ఉచ్ఛ్వాస, నిశ్వాసలను రూపొందించుకో వలెనని గుర్తించి, ఆ రీతిగా బ్రతకటమే విషయములనుంచి మనస్సుకు "ముక్తి" కలిగించటం!

అందుకు శారీరకంగానూ, మానసికంగానూ ఎంతో సాధన అవసరం. దానివల్ల శరీరం, మనస్సు జీవితాంతం వరకూ చాలా శక్తివంతంగా ఉంటాయి. శక్తి ఉంటేనే ఆరోగ్యం. ఆరోగ్యం ఉంటేనే నిజమైన ఆనందం! అష్టాంగయోగసాధన ద్వారా ఈ మార్గంలో ఇంద్రియాలనూ, మనస్సునూ ఎంతో శక్తి వంతం కావించే పద్ధతిని ప్రపంచం అంతా గుర్తించింది. కానీ 'యోగము' అనేమాట వినేసరికి నేటి యువతరం బెదిరిపోయే పరిస్థితిని కలిగించారు కొందరు పెద్దలయిన వాళ్ళే. కానీ ఈనాడు ఈ యోగాన్ని ఒక Physical Culture గా, ఒక Mental

**పాతూరి ప్రసన్నం**

Culture గానూ మన యోగాచార్యులు ప్రపంచం అంతటా ప్రచారం చేస్తూ, ఎన్నో సత్ఫలితాలను కలుగజేస్తున్నారు: ఈ "యోగ" శిక్షణ తరగతులకు హాజరు అవుతున్న యువతీ యువకులు ఎంతో చురుకుగా, సంతోషంగా ఉంటూ, తాము ఎంచుకున్న విద్యలోనో, కృషిలోనో తమ మనస్సును చాలా చక్కగా కేంద్రీకరించి వైజ్ఞానికంగా ఎంతో ముందంజ వేస్తున్నారు. మనస్సును ఇటువంటి సాధనల ద్వారా అదుపులో పెట్టుకోవటం చాలా అవసరం.

'నెగిటివ్' లక్షణాల నుంచి మనస్సును విడిపించటం ఒక విధంగా 'మోక్షం' వంటిదే అయినా పాజిటివ్ గా కూడా మనస్సులో ఎన్నో మంచి లక్షణాలను ప్రవేశపరచాలి. అప్పుడే మనస్సు లక్ష్యసాధనలో ఒక గొప్ప ఆయుధం వంటిది అవుతుంది. కాబట్టి ఈ 'పాజిటివ్' దిశలో (Positive side) మనస్సును పురోగమింప జేయుటయే 'మతం' యొక్క యదార్థమైన ఆశయం. ఈ గ్రంథం రెండవ భాగంలో ముక్తి మార్గంలో మనస్సు వికసించటాన్ని గూర్చిన విపులీకరణ కనిపిస్తుంది.

**ప్రస్తుతం 'ముక్తి'ని గూర్చి విచారిద్దాం.**

'ఎవరికి ముక్తి?' అనే ప్రశ్నకు సమాధానం కావాలి. మనస్సుకు, చిత్తానికి, బుద్ధికి, అహంకారానికి అనగా

అంతఃకరణ చతుష్టయానికి ముక్తి కావాలి. విషయ సుఖాలన్నీ, 'దేహమే నేను' అనే భావనగల మనస్సును ఆకర్షిస్తాయి. చివరకు 'ఈ దేహం నేను కాదు' అనే యదార్థాన్ని సాధకుడు తెలుసుకున్ననాడు, ఈ జీవుడే దేవుడని తెలుసుకున్ననాడు, మనిషికి నిజంగా ముక్తి లభించినట్లే, అని తత్త్వశాస్త్రం బోధిస్తోంది. ఒక్కసారిగా ఈ అంశాన్ని గూర్చి అవగాహన కలగటం కష్టం. విశిష్టమైన ఆధ్యాత్మిక సాధనల ద్వారా మనసు ఈ అవగాహనను, ఈ జ్ఞానాన్ని ఎలా పొందుతుందో ఈ పుస్తకం రెండవ భాగంలో తెలుసుకుందాం.

"ముక్తి ఎందుకు?" అనేది మరొక ప్రశ్న. " ఈ వయస్సులో ముక్తిని గూర్చిన విచారణ ఏమిటి?" అంటారు కొందరు. అలా అనటానికి కారణం, వారికి "ముక్తి" అనే పదమును గూర్చిన సరియైన అవగాహన లేకపోవటమే. సరియైన అవగాహన లేకపోగా ముక్తిని గూర్చి మనకు చాలా అపోహలు కూడా ఉన్నాయి.

విలువలేని వాటిలో మనస్సు తగుల్కోవటం 'బంధన' అయితే ఎంతో విలువగల వాటితో మనస్సు ప్రయాణించటం, చివరకు కలిసిపోవటం 'ముక్తి' అని మనం చెప్పుకోవచ్చు. పనికివచ్చే వాటిని పట్టుకోవటం అంటే పనికి రాని వాటిని విడుచుకోవటం అనే అర్థం కదా! ఒకటి జరగనిదే మరొకటి జరగదు. ప్రస్తుతానికి ప్రతి మనిషీ ఎన్నో పనికిరాని వాటిని పట్టుకొని కూర్చోవటం, పనికి వచ్చే వాటిని ఉపేక్షించటం జరుగుతోంది. పనికిరాని అవలక్షణాలను, అవగుణాలను విడవటం, సుగుణాలను అలవరచుకోవటం మన ఆరోగ్యానికి ఎంతో మంచిది.

కాబట్టి 'ముక్తి'ని కోరటం అనేది ఎప్పుడో వయస్సు మళ్ళిన తరువాత, వృద్ధాప్యంలో కలుగవలసిన కోరిక అనుకోవటం పొరపాటు. కనుక పనికిరానివేవో చిన్నతనం నుంచి తెలుసుకొనే అవగాహనను మనం పిల్లలకు కల్పించాలి. పనికి వచ్చే వాటి కోసం బాల్యం నుంచీ పరిశ్రమ ప్రారంభం కావాలి. అప్పుడే మనిషి ప్రయోజకుడౌతాడు.

'ముక్తి' అంటే చచ్చిపోయిన తర్వాత ఏదో లోకాన్ని పొందటం అనే భావన సమగ్రమైనది కాదు. బ్రతికి ఉండగానే అది మనలో ఒక విధమైన మానసిక స్థితిగా (State of Mind) బాల్యం నుంచీ పోషింపబడాలి, పెంపొందాలి. ప్రతి మనిషికీ ఆకలి నుంచీ, అజ్ఞానం నుంచీ, రోగం నుంచీ, దారిద్ర్యం నుంచీ, దాస్యం నుంచీ బయటపడాలనే ఉంటుంది. కాబట్టి రోగం, దారిద్ర్యం, దాస్యం, ఆకలి, అజ్ఞానం అనేవి బంధాలుగా, సంకెళ్ళుగా వర్ణింపబడ్డాయి. వాటి నుంచి ప్రతి మనిషీ బయటపడటానికి ప్రయత్నిస్తాడు. అలా బయటపడటమే 'ముక్తి'. Freedom, Liberation, Emancipation వంటి పదాలు స్వేచ్ఛ, విముక్తి, మోక్షం అనే పదాలూ, మనం చెప్పుకొనే ముక్తి అనే పదానికి పర్యాయపదాలే! వీటినే వివిధమైన మానసికమైన స్థితులలో గుర్తించి నిర్వచించారు ఆది శంకరాచార్యులవారు! ఈ ముక్తి నాలుగు విధములైన ముక్తి యొక్క స్వరూపములని ఆదిశంకరాచార్యులవారు వ్యాఖ్యానిస్తారు.

ఆధ్యాత్మిక సాధనలుగా ఈ నాలుగు పదాలకూ గల అన్వయాన్ని ఈ గ్రంథం రెండవ భాగంలో తెలుసుకోబోతున్నాం. ప్రస్తుతం వీటికిగల లౌకికమైన సమన్వయాన్ని గూర్చి తెలుసుకోవాలి. అప్పుడే 'ముక్తి' అనే పదానికిగల సమగ్రమైన అవగాహన మనలో కలుగుతుంది.

# విదురనీతి

"కులాని సముపేతాని
గోభిః పురుషతో2 ర్థతః
కులసంఖ్యాం నగచ్ఛన్తి
యాని హీనాని వృత్తతః"

ఏ కులములందు గోవులు, మనుష్యులు, ధనమున్ను సమృద్ధిగా నుండినను, సదాచారముండదో, అవి గొప్ప వంశములుగా పరిగణింపబడవు.

ఒక క్షేత్రంలో మంచిపంటను పండించటం కోసం ముందుగా ఆ క్షేత్రాలలో మొలిచిన కలుపు, గడ్డి, గాదం వంటి వాటిని తొలగించాలి. తర్వాత కావలసిన పంటను నాటి పోషించుకోవాలి, పండించుకోవాలి. ఈ వ్యావసాయకమైన కృషిలో కలుపు మొక్కల నుండి క్షేత్రానికి 'మోక్షం' కలిగించాము. ఆ తర్వాతనే అవసరమైన పంట పండించటంలో కృతకృత్యులం అయ్యాము.

ఇదే రీతిగా ముందుగా మనస్సుకు ప్రగతి నిరోధకములుగా ఎదురయ్యేవాటి నుండి విముక్తి కలిగించాలి. ఆ తర్వాత ఆ మనస్సును నాలుగు విధములైన ప్రభావాలకు లోనుకావించాలి. నిత్యజీవితంలో ఏ రంగంలోనైనా విజయం సాధించ తలుచుకుంటే ఈ విధమైన మానసికమైన Approachని మనం ఏర్పరు చుకోవాలి.

ఒక ఉదాహరణ! ఒక పిల్లవాడున్నాడు. వాడిని ఒక కలెక్టర్‌గా చేయాలి, లేదా ఒక ఇంజనీరుని చేయాలి, లేదా ఒక గొప్ప ఆర్టిస్టుగా చేయాలి. అతని చేత ఆ లక్ష్యాన్ని సాధింపజేయటంలో అతని మనస్సును ముందుగా లక్ష్య సాధనకు 'ప్రిపేర్' చేయాలి. వాడిమనస్సులో 'నేనొక కలెక్టర్‌ను కావాలి' అనే తలంపే లేకపోతే మనం అతని కోసం ఎన్ని చేసి ఏం లాభం? ఆ తర్వాత అతని మనస్సును ఈ దిగువ మార్గంలో క్రమంగా ముందుకు తీసుకుపోవాలి.

1. సాలోక్యముక్తి :- బాహ్య ప్రపంచ పరిస్థితులను, మనుష్యులను హఠాత్తుగా మనం మార్చివేయలేము. కానీ మన మానసిక ప్రపంచాన్ని మనం మార్చివేయగలం. తర్వాత ఈ మానసిక ప్రపంచమే తన ప్రభావాన్ని బాహ్య ప్రపంచంపైన ప్రసరింపచేసి, బాహ్య పరిస్థితుల్ని కూడా మార్చివేస్తుంది.

ఒక దరిద్ర కుటుంబంలో పుట్టినా కూడా ఆ విద్యార్థి మనస్సులో గాఢంగా తానొక కలెక్టర్‌ను కావాలనే సంకల్పం స్థిరపడిపోతుంది. ఆలోచించినా, కలలు కన్నా అంతా తాను ప్యాసు కాబోయే I.A.S. పరీక్షను గురించే! ఈ ప్రబలమైన మానసిక ప్రపంచంలో అతడు తాను I.A.S. పరీక్షలో ఉత్తీర్ణుడు కావటం కోసం ఎన్నెన్నో అభిప్రాయాలు ఏర్పరచుకున్నాడు. అతని మాటలు, అతని చేతలు, అతని కృషి అంతా ఆ మార్గంలోనే సాగుతోంది. అంతకు ముందు I.A.S. ప్యాసై కలెక్టర్‌గా పనిచేస్తున్న వారితో పరిచయాలు, వారి కృషిని గూర్చిన అనుభవాలు, కలెక్టర్‌గా పొందవలసిన వ్యక్తిత్వం, ఆలోచనాధోరణి, అన్నీ అతనికి మానసికంగా సమకూరినై. ఈ మానసిక ప్రపంచం యొక్క ప్రభావంతో అతనిలోగల సమర్థత (Competency) పెరిగింది. అతనికి సినిమాలు, షికార్లు, కాలక్షేపాలూ, చేయటానికి ఇప్పుడు తీరికలేదు, తీరిక ఉన్నా వాటిపై మనస్సు లేదు! దీన్నే 'స్థిరభూమిక' అంటారు. అతని మనస్సులో 'సంకోచాలు', 'సందేహాలు' లేవు. ఈ రీతిగా అతనిలో రూపొందిన మానసిక ప్రపంచం యొక్క ప్రభావంతో ఎంతో కృషి చేస్తూ సమర్థతను పెంచుకున్నాడు. ఇప్పుడతనిలో ఎంతో 'ఆత్మ విశ్వాసం' కలిగింది. కాబట్టి పరీక్ష వ్రాయటం, అందులో ఉత్తీర్ణుడుకావటం అనేవి రానున్న కొద్దికాలంలో యదార్థం కాబోతున్నాయి. వాటికి ముందుగా అతడు మానసికంగా ఒక 'కలెక్టర్'గా మారిపోయాడు! మానసిక ప్రపంచం వాస్తవజీవితంలో ఎంతో ప్రభావాన్ని కలిగించే తీరు ఇదే! అదే రీతిని ఒక చిత్రకారుడు ఒక అద్భుత చిత్రాన్ని చిత్రించే ముందుగా, అతని మనస్సులో ఆ చిత్రం పరిపూర్ణంగా ఆకృతిని ధరిస్తుంది! ఒక మహా గాయకుని పాట శ్రోతలను సమ్మోహనపరచే ముందుగా అతని మనస్సులో నుంచి పుట్టిన ఆ రాగం, ఆ పాట అతన్ని సమ్మోహితుణ్ణి చేస్తాయి!

## యక్ష ప్రశ్నలకు సమాధానాలు

"బ్రాహ్మణ స్వయం మాహూయ
యాచమానమకించనమ్
ప్రశ్నాన్నాస్తీతి యో బ్రూయాత్
సో 2 క్షయం నరకం వ్రజేత్"

దరిద్రుడూ, యాచకుడూ ఐన బ్రాహ్మణుణ్ణి స్వయంగా పిలిచి ఎవడు ఏమీ ఈయకుండా అతణ్ణి ఒట్టి చేతులతో పంపుతాడో అతడు తరగని నరకాన్ని అనుభవిస్తాడు.

మనం ఈ రీతిగా ఒక మానసిక ప్రపంచాన్ని సృష్టించిన తర్వాత, బాహ్యజీవితాన్ని కూడా మనం కోరిన రీతిలో మార్చుకోగలం, అని ఆధునిక మనస్తత్వవేత్తలు, మన ప్రాచీన తత్త్వవేత్తలు నిరూపించారు!

'యద్భావం తద్భవతి' (ఏది భావిస్తోందో అదే అవుతుంది.) అన్నా, "What mind Conceives, it achieves" అన్న మాటల్లోగల పరమార్థం ఇదే! 'ప్రపంచం మారాలి' అనీ, 'నేను మారాలి' అనీ ప్రతి మనిషీ అనుకోవటం సహజమే! కానీ ఆ మార్పు మానసిక ప్రపంచం మారటంతోనే ప్రారంభం కావాలి!

ఒక భార్యాభర్తల జంట పెళ్లి అయిన కొంతకాలం వరకు అన్యోన్యంగానే ఉన్నారు. కొంతకాలం తర్వాత భర్త అలవాట్లు మారినై. అతడు ఆమెను తన ప్రవర్తన ద్వారా ఎంతో బాధపెడుతున్నాడు. చివరకు కలిసి కాపురం చేయలేని పరిస్థితులు కలిగినై. ఇద్దరూ 'డైవోర్సు' కోసం కోర్టుకుపోయారు! కానీ అతడు తన ప్రవర్తనను మార్చుకుంటే అతనితో కాపురం చేయటానికి తనకు ఏమీ అభ్యంతరం లేదని ఆమె కోరుకుంటూ ఉన్న సమయంలో శ్రీ నెపోలియన్ హిల్‌తో పరిచయం కలిగింది. "ముందుగా నీ మనస్సులో నీ భర్త పూర్తిగా మారిపోయినట్లు, నీవు అతనినీ, అతడు నిన్నూ పూర్తిగా ప్రేమిస్తున్నట్లు నీ మనస్సులో భావించి, నీ మానసిక ప్రపంచంలో కొంతకాలం అతనితో ఎంతో అన్యోన్యంగా ఉంటున్నట్లు, అనుభూతిని చెందు. అతడు మారిపోతే నీవు అతని ఎడల ఎలా ప్రవర్తిస్తావో అలాగే అతనితో ప్రవర్తించు'' అంటూ కొంతకాలం - శ్రీ నెపోలియన్ హిల్ ఎన్నో సూచనలను ఆమెకు అందించారు. చివరకు డైవోర్సు తీర్పు పొందే గడువు లోపుగానే ఆమె ప్రవర్తనను, ఆమె మానసిక స్థితినీ, గుర్తించిన ఆమె భర్తలో ఎంతో మార్పు కలిగింది. ఒక రోజున "మనం డైవోర్సు తీసుకుందామా?" అని ఆమె అతనితో అన్నది. "ఎందుకు?" "No Problem" అని డైవోర్సు ఆలోచనకు స్వస్తి చెప్పాడు భర్త. వారు కలకాలం అన్యోన్యంగా ప్రేమతో ఒక జంటగా బ్రతికారు.

కాబట్టి ఈనాడు భౌతికంగా, లౌకికంగా మన చుట్టూ అశాంతి, ద్వేషం, సమస్యలు, దుఃఖంవంటివి తాండవిస్తున్నప్పటికీ, వాటి నుంచి విముక్తిని కోరే మనలో ముందుగా ఈ విధమైన మానసిక ప్రపంచంలోనే ఒక మార్పురావాలి! మన మనస్సులో శాంతి, ప్రేమ, పరిష్కారం, ఆనందం అనేవి పూర్తిగా వ్యాపించాలి. అవి మన ఆలోచనలనూ, మన పరిష్కారమార్గాలనూ, మన ప్రవర్తననూ ప్రభావితం చేయాలి. అటువంటి మనస్తత్త్వంతో చేసిన వివేకవంతమైన కృషి ద్వారా మన లౌకిక, భౌతిక ప్రపంచవాతావరణం పూర్తిగా మనం ఆశించినట్లుగా మారిపోతుంది. ఇది ఎంతో మంది Successful Personalities (కృతకృత్యులైన వ్యక్తుల) జీవితాల్లో మనం చూచే ఒక యదార్థ సత్యం. ద్వంద్వ ప్రపంచంలో బ్రతికేవారికి ఇది అసాధ్యం కాదు. కాస్సేపు ఒక విలువ, మరి కాస్సేపు అందుకు విరుద్ధమైన మరొక విలువతో బ్రతికేవారికి ఇది అసాధ్యం కాదు. మనం ఈనాడు ఆలోచించేది ఒకటీ, చెప్పేది ఒకటీ, చేసేది ఒకటీ కావటం ద్వారా మనం ఎన్ని అనర్థాలను కొని తెచ్చుకుంటున్నాము? మనలోనుండి ఈ 'ద్వంద్వ ప్రమాణాలు' తొలగిపోవాలి.

ఒకేమాట, ఒకేబాట, ఒకే లక్ష్యం వంటి స్థిరత్వానికి చెందిన సదాశయాలు మనలో కలగాలి, అవి సఫలీకృతం కావాలి, అనుకుంటే, ముందుగా మనలో ఆ సాలోక్యం అనే మానసిక వ్యవస్థ ఏర్పడాలి.

సరిగ్గా Imagine చేయగల సమర్థత మనస్సుకు అలవడితేనే ఈ సాలోక్యసిద్ధి కలుగుతుంది. Imagination అనేది కవులకూ, కళాకారులకూ మాత్రమే కాదు. నీవు ఏమి కాదలచావో, ముందుగా నీకు నీవు Imagine చేసుకోగలగాలి. నేటి సైన్సు, సాంకేతిక రంగాల వెనుక అనేక అద్భుతావహమైన శాస్త్రపరిశోధనారంగంలోని అపూర్వఫలితాలన్నింటి వెనుకా, వాటి వాటి నిర్మాతల యొక్క అపూర్వమైన Imaginative (భావనాత్మక శక్తి) ఉందని వారి జీవిత చరిత్రలు చదివితే తెలుస్తుంది.

"నా జీవితంలోని ఈ పరిస్థితులు నాకు ఇష్టం లేనివి. నా పరిస్థితులను నేను బాగుచేసుకుంటాను, అనే నిశ్చయాత్మక బుద్ధికి ఈ Imagination ఎంతో

సహకరించి, బుద్ధి పనిచేయవలసిన తీరుకు ఒక మార్గాన్ని కలిగిస్తుంది. మనలో చాలామందికి ఏదో మారిపోవాలనే ఉన్నా, ఆ మార్పు మనలో ఎన్నటికీ కలగకపోవటానికి గల కారణం మనం ఏది కాదలచుకున్నామో, ఎలా మారిపో దలచుకున్నామో సరిగ్గా ఊహించుకోలేకపోవటమే. కొంతమంది ఊహించుకోగలిగినా దానిని సఫలీకృతం చేయటంలో గల కార్యాచరణ సమర్థత లోపించడమే!

మామూలు మనుష్యులుగానే పుట్టి, సాధారణ పరిస్థితులలో మనలాగానే పెరిగినా కూడా జెంషెడ్జీటాటా, ఫోర్డ్, నెపోలియన్ హిల్, అబ్రహంలింకన్, జగదీశ్ చంద్రబోస్, మహాత్మాగాంధీ, వీరేశలింగం, గురజాడ అప్పారావు వంటి ఎందరో మహనీయులు తాము తమ యొక్క భావనాశక్తిచేత ఎంతో ఎదిగి, సమాజం యొక్క ఎదుగుదలకు కూడా ఎంతో సేవ చేశారు!

మానసికంగా అటువంటి రీతిగా ఒక నిర్దుష్టమైన విలువగల ప్రపంచాన్ని నిర్మించుకొన్న వ్యక్తుల చుట్టూ, ఆ మానసిక వాతావరణం కదలాడుతూ ఉంటుంది. భౌతికమైన అవరోధాలను ఈ మానసిక ప్రపంచశక్తి అధిగమించి తీరుతుంది!

ఇదే ముక్తిని గూర్చి మనం తెలుసుకోవలసిన మొదటి స్వరూపం!

"Formulate and Stamp indelibly on your mind a mental picture of yourself as succeeding. Hold this picture tenaciously. Never permit it to fade. Your mind will seek to develop this picture. Never think of yourself as failing. Never doubt the reality of the mental image. This is most dangerous, for the mind always tries to complete what it pictures. So always picture "SUCCESS" no matter how badly things seems to be going at the moment" అంటారు శ్రీ నెపోలియన్ హిల్.

సాలోక్యం అనే ముక్తికి సరియైన వ్యాఖ్యానం ఇదే! సాలోక్యం అంటే పగటికలలు కనటం మాత్రం కాదు!

# క్షమాగుణం

అక్కడ తెల్లవారు నడుమువీధులలో నల్లవారు నడువకూడదు. భోజనశాలలోగాని, రైళ్ళలోగాని, బస్సులలో గాని నల్లవారికి ప్రవేశించే అధికారములేదు.

ఒక వ్యక్తి ఓడదిగి రాగానే తెల్లవారు అతనిని గుర్తుపట్టి 'కూలి బారిష్టర్' అని కేకలువేసి గేలిచేస్తూ కొట్టారు. దెబ్బలు తినిపడిపోయిన ఆ వ్యక్తిని మంచి మనస్సుగల ఒక ఆంగ్ల వనిత ఆ తెల్లవారి గుంపును ఎదిరించి కాపాడింది. ఆ తెల్లవారు అతనికి ఎక్కడానికి వాహనము కూడా లేకుండా చేశారు. రక్షకభటులు వచ్చి అతనిని కాపాడారు. ఈ విధంగా అన్యాయంగా హింసించినవారిపై ఫిర్యాదు చేస్తే ప్రభుత్వము వారిని శిక్షిస్తారు.

కాని ఆ 'కూలి బారిష్టర్' అని పిలువబడిన వ్యక్తి ""భగవంతుడు వారికి మంచి బుద్ధి కలుగచేసి క్షమించుగాక!" అని వారిపై ఫిర్యాదు చేయకుండా విడిచిపెట్టాడు. ఇతని చర్యకు తెల్లవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

ఈ క్షమాగుణం కలిగిన వ్యక్తి గాంధీజీ! ఈ సంఘటన దక్షిణాఫ్రికాలో జరిగింది. తరువాత అహింసా మార్గంలో పోరాడి మనకు స్వాతంత్రం రావడానికి కారకులలో ప్రథమశ్రేణిలో నిలిచాడు.

ఈ క్షమాగుణం ఎవరో బోధిస్తే వచ్చేదికాదు. హృదయంలోంచి రావాలి. ఓర్పు కోల్పోకూడదు. అదే సత్యం, ధర్మం, వేదం, అహింసా సర్వం...... అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

- ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

మనోభిరామం - 25

# కాంతా కనకాలు - కష్ట కారకాలు

మానవుని ఇంద్రియాలను ప్రలోభపరిచే ప్రాపంచిక విషయాలలో స్త్రీ అతి ప్రధానమైనది. ఎంతటి నిగ్రహశక్తిగల మగధీరుడైనా, ఆడది అగుపించగానే పరవశుడైపోతాడు. ఆమె అందచందాలు, అవయవ పొంకాలు, బింకాలు, మేని సౌందర్యాలు, అతని చిత్తాన్ని చిత్తు చేస్తాయి. అశాశ్వతమైన ఆ బాహ్య సౌందర్యానికి వ్యామోహితుడౌతాడు. భౌతిక సుఖానందాన్నిచ్చే ఆమె పొందుకోసం తహతహలాడిపోతాడు. ఆ ఆనందపారవశ్యంలోనే ఆమె అతన్ని లోబర్చుకొంటుంది. తన మనోవాంఛల్ని ఈడేర్చుకుంటుంది. అందుకే "ఎంత వారలైన కాంతదాసులేగా!" అంటారు త్యాగరాజస్వామి.

అయితే ఈ స్త్రీ వ్యామోహం హద్దుమీరి అపమార్గాన పడితే వినాశనం తప్పదు. శివ భక్తుడు, నిత్యపూజాతత్పరుడు, రావణ బ్రహ్మ, ఉచితానుచితములను మరిచి, సీతాదేవిని మోహించి, సామాన్య మానవుడైన రాముని చేతిలో హతుడౌతాడు. దురహంకారములో కన్ను మిన్నుకానని నహుషుడు, దేవేంద్రునినతి శచీదేవిని చెరబట్టబోయి శాపగ్రస్తుడయ్యాడు. పాండవపత్ని పాంచాలిని చూచి మోహపరవశుడైన కీచకుడు భీమసేనుని ముష్టిఘాతములబడి ప్రాణాలు కోల్పోతాడు.

స్త్రీ వ్యామోహానికి దూరంగా ఉన్న మహాపురుషులూ ఉన్నారు. భక్త సూరదాసు గంగానదీ తీరాన భగవధ్యానము చేస్తూ కాలం గడుపుతున్నాడు. అతని భగవద్భక్తిని, భగవత్సేవను జనులు వేనోళ్ళ పొగుడుతారు. అసూయాపరుడైన ఆగర్భ శ్రీమంతుడొకడు అతనిని చెడగొట్టాలని తలుస్తాడు. ఆధ్యాత్మిక మార్గం నుంచి లౌకిక మార్గానికి మళ్ళించమంటూ అందచందాల యవ్వనవతిని అతనిపై వినియోగిస్తాడు. తన అందచందాలతో, హావ, భావాలతో, మేనివిరుపులతో, అతనినాకట్టుకోవాలని శత విధాల ప్రయత్నించిందామె! అచంచల మనస్కుడైన సూరదాస్ లొంగకపోవడంతో ఆమె తన తప్పిదాన్ని తెలిసికొని, పశ్చాత్తాప హృదయంతో అతని పాదాలపై పడుతుంది. తుచ్ఛమైన కోరికలకు బానిసగాకుండ, భక్తితో భగవత్సేవలోనే బ్రతుకుగడపమంటూ ఉపదేశిస్తాడు!

అలాగే ఛత్రపతి శివాజీ, తన సేనాధిపతి బందీగా తెచ్చిన స్త్రీమూర్తిని, "తల్లీ! మా సేనాపతి చేసిన తప్పిదానికి నన్ను మన్నించమ్మా!" అంటూ ఆమెను సగౌరవంగా పంపివేస్తాడు.

## సోమంచి రామం

స్త్రీ వ్యామోహం తరువాత చెప్పకోతగ్గది శ్రీ వ్యామోహం! అంటే ధనాపేక్ష! సంపదపై మక్కువ! ధన కనక వస్తువాహనాదుల సంపాదనపై అమితమైన ఆకాంక్ష! ధర్మబద్ధంగా, దాయాదులకు సంక్రమించాల్సిన భాగాన్ని కూడా చేజిక్కించుకోవడంలాంటి తాపత్రయం! అర్ధరాజ్యం కాకపోయినా అయిదూళ్ళైనా యిమ్మని అర్థిస్తారు పాండుపుత్రులు! సమస్త భోగభాగ్యములు తనకే దక్కాలన్న వెర్రి వ్యామోహంతో అందుకంగీకరించడు దుర్యోధనుడు. పెద్దలు, వయోవృద్ధులు, నీతి కోవిదులు అందరూ ధర్మ సూక్ష్మాలను చెప్పిన అధికారమదాంధుడైన అతని చెవికెక్కవు. 'వినాశకాలే విపరీత బుద్ధి'! అన్న రీతిగ తన నాశనము, తన వంశ నాశనమును చేజేతులాకొని తెచ్చుకుంటాడు. ధన వ్యామోహం ఎంత దారుణమైనదో దుర్యోధనోదంతము మనకు చెప్తుంది.

అయితే అందుకు భిన్నమైన వ్యక్తి భక్తతుకారాం! అతని భక్తి తత్పరతకు, నిగ్రహశక్తికి ముగ్ధుడై అమిత సంపదను అందచేయబోతాడు ఛత్రపతి శివాజీ! "భగవత్సేవకు నన్ను నేనే అర్పించుకొంటే, నాకెందుకీ సంపద" అంటూ తిరస్కరిస్తాడు తుకారం.

అందుకే సత్పురుషులు, యోగులు, మహర్షులు కాంతా కనకాలను దరిచేరనీయరు. 

# చంద్ర ఘంటాదేవి - 3

పిండజ ప్రవరారూఢా చండకోపాస్త్ర కైర్యుతా,
ప్రసాదం తనుతే మహ్యాం చంద్రఘంటేతి విశ్రుతా.

దుర్గామాతయొక్క తృతీయ శక్తి చంద్రఘంటా దేవి నామంతో ప్రఖ్యాతి చెందింది. నవరాత్ర్యుపాసనలో మూడవనాడు ఈమె విగ్రహాన్నే పూజించి ఆరాధిస్తారు. ఈమె స్వరూపం పరమశాంతిదాయకమై కళ్యాణ ప్రదమైనది. ఈమె మస్తకం పై ఘంటాకారంలో అర్ధచంద్రుడున్నాడు. ఈకారణం వల్లనే ఈమెను చంద్రఘంటాదేవి అని పిలుస్తారు. స్వర్ణసమంగా ఈమె శరీర వర్ణం భాసిల్లుతూ ఉంటుంది. ఈమెకు గల దశహస్తాలలో ఖడ్గాది శస్త్రాలూ, బాణాది అస్త్రాలూ రాజిల్లుతూ ఉంటాయి. సింహవాహిని అయిన ఈమె ముద్ర సర్వదా యుద్ధోన్ముఖమై ఉంటుంది. ఘంటా సదృశమైన ఈమె చండ ధ్వనులకు అత్యాచారులైన దైత్య దానవులు కంపించిపోతుంటారు.

నవరాత్రులలో కొనసాగే దుర్గాదేవీ ఉపాసనలలో మూడవనాడు జరిగే పూజ అత్యంత మహత్వపూర్ణంగా ఉంటుంది. నాడు సాధకునికి మనస్సు మణిపూరక చక్రంలో ప్రతిష్ఠితమై ఉంటుంది. చంద్రఘంటాదేవి కరుణవల్ల సాధకునకు అలౌకిక వస్తువుల దర్శనమవుతుంది. దివ్య సుగంధానుభవం కలుగుతుంది. వివిధ ప్రకాశ ధ్వనులు వినవస్తాయి. సాధకుడు అత్యంత సావధానంగా ఉండవలసిన క్షణాలివి.

చంద్రఘంటాదేవి కృపవల్ల సాధకుని పాప తాపాలన్నీ నశించిపోతాయి. ఈమె ఆరాధన సర్వఫలదాయకమైనది. సర్వదా ఈమె యుద్ధోన్ముఖ ముద్రతో ఉంటుంది. కనుక భక్తుల కష్టాలను ఈమె అత్యంత శీఘ్రంగా నివారిస్తుంది. ఈమె వాహనం సింహం కావడం వల్ల ఈమెను ఉపాసించేవారు కూడా సింహ సమ పరాక్రమంతో నిర్భయంగా ఉంటారు. ఈమె ఘంటానాదం - సదా ఈమె భక్తులను ప్రేత బాధాదుల నుండి సంరక్షిస్తూ ఉంటుంది. ధ్యానమాత్రంచే శరణాగత సంరక్షణార్థం ఈమె ఘంటా ధ్వని మారుమ్రోగుతుంది.

దుష్టదమన వినాశనాంతరం కూడా ఈమె సర్వదా తత్పరురాలై ఉన్నా కూడా ఈమె స్వరూపం దర్శకులకు, ఆరాధకులకు అత్యంత సౌమ్యంగా, శాంతంగా ఉంటుంది. ఈమె ఆరాధన మాత్రంచే, సాధకునకు లభించే వీరత్వ నిర్భయత్వాలతో బాటు సౌమ్యత్వ

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

వినమ్రతలు కూడా లభించడం విశేష సద్గుణమే కదా! సాధకుని ముఖనేత్రాది శరీరాంగాలన్నీ చంద్రఘంటాదేవి కరుణ వల్ల తేజరిల్లుతుంటాయి. వారి స్వరంలో దివ్య అలౌకిక మాధుర్యం గోచరమవుతుంది. చంద్ర ఘంటా దేవి భక్తులు కానీ, ఉపాసకులు కానీ ఎక్కడకు వెళ్ళినా వారిని చూచిన ప్రజలు సుఖ శాంతులను పొందుతారు. అట్టి సాధకుల శరీరాల నుండి దివ్య ప్రకాశయుక్త పరమాణువుల అదృశ్య వికరణం జరుగుతూ ఉంటుంది. ఆ దివ్య క్రియ ఈ చర్మ చక్షువులకు మాత్రం గోచరించదు. కానీ సాధకులూ, వారి సాంగత్యంలో ఉండేవారు మాత్రం ఆ విషయాలను చక్కగా అనుభవించగలుగుతారు.

మనం మన మనోవాక్కర్మ శరీరాలను విహిత విధి విధానానుసారం పరిపూర్ణంగా, పరిశుద్ధంగా, పవిత్రంగా ఉంచుకుని చంద్రఘంటాదేవిని శరణువేడి తదుపాసనలో సంలగ్నులమవ్వాలి. ఆ తల్లిని ఉపాసించడంలో మనం మన సాంసారిక కష్టాలు అన్నింటి నుండి విముక్తులమై సహజంగానే పరమ పదాధికారులము కాగలుగుతాము. నిరంతరం మనం ఆమె పవిత్రమూర్తిని ధ్యానమందుంచు కుని సాధన వైపు పురోగమించాలి, ప్రయత్నించాలి. ఆమె ధ్యానం మన ఇహ పరాలను రెండింటినీ చక్కగా జేసి పరమ కళ్యాణ ప్రదమైన సద్గతిని ప్రసాదిస్తుంది. ☆

ఆర్.యస్.కె. స్మారక వ్యాసరచన పోటీలలో ప్రథమ బహుమతి పొందిన వ్యాసం

# యువతరానికో సందేశం

సమస్త జీవకోటిలో మానవుడు అత్యున్నత జీవి. సృష్టి మానవునికి ఇచ్చిన అత్యద్భుతమైన అతి విలువైన వరం మేధాశక్తి. ఆ మేధస్సుతో తనకు కావలసిన భూతల స్వర్గాన్ని సృష్టిస్తూ, సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్నాడు. భాష, నాగరికత తెలియని ఆటవిక మానవుడు అభివృద్ధి చెంది అంతరిక్షంలో అడుగుపెట్టి చంద్రమండలంపై ఇండ్లు నిర్మించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆటవిక మానవుడు ఆధునిక మానవునిగా తన విలువను పెంచుకొనుటకు ఉపయోగపడినది అతని మేధస్సు. ఆ మేధస్సుకు పదును పెట్టి వెలకట్టలేని వజ్రంగా మార్చాలంటే విద్య ముఖ్య సాధనం. సృష్టిలో పుట్టటం గిట్టటం అనేవి సహజం. కానీ ఆ పుట్టుటకు, గిట్టుటకు మధ్య అనంత విశ్వాన్ని అర్థం చేసుకొనుటకు విద్య ద్వారా అవకాశం కలుగుతుంది. క్రిమి కీటకాదులు, పశుపక్ష్యాదులులాగా పుట్టి, చచ్చిపోయేకంటే జీవితంలో ఏదో ఒకటి సాధించడమే గొప్ప. జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. దానికి ఒక పద్ధతి, క్రమరీతిలో, నియమ నిబంధనలతో నిష్కల్మషంగా, నిష్పక్షపాతంగా ఉండాలి. అందుకు పునాది యువత. యువతలో గల విశ్వాసాన్ని మేల్కొల్పగలిగితే మన దేశం ఎదుర్కొంటున్న సమస్యల్ని పరిష్కరించగలము.

"జీవిలోని నిద్రాణమైఉన్న సహజశక్తులను వెలికి తీయునది విద్య."

గాంధీజీ: "నా ఉద్దేశ్యము ప్రకారము మానవుని లోని మంచిని వెలికి తీసి మానసికంగాను, శారీరకంగాను, నైతికంగాను, సాంఘికంగాను తీర్చిదిద్దునది విద్య."

''జీవితానుభవములను ఎప్పటికప్పుడు నెమరునకు తెచ్చుకొనుచు సహజశక్తులను పెంపొందించు కొనుచు తద్వారా తన పరిసరములను, సామాజిక పరిస్థితులను వ్యక్తి అవసరములకు అనుగుణంగా మార్చుకొను నేర్పు కలిగించునది విద్య''.

"మానవుని పరిణామక్రమంలో సంపాదించిన జ్ఞానాన్ని తరువాత తరాలకు అందించడం విద్య" యొక్క ప్రధాన లక్ష్యం. వ్యక్తి సమాజంలో ఒక భాగము. జాతి ప్రగతి వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యములు, నిస్వార్థ సేవా దృక్పథము, భక్తి శ్రద్ధల మీద ఆధారపడియుండును. వీటిని వ్యక్తిలో సక్రమంగా పెంపొందించుటలో విద్య ప్రముఖ పాత్ర

## సి.హెచ్. కనకదుర్గ

వహించును. విద్య సమాజ చైతన్యానికి కృషి చేస్తుంది. నవసమాజ నిర్మాణానికి దారి తీస్తుంది. హేతువాద ఆలోచనా శక్తిని, సేవాదృక్పథాన్ని,ఆదర్శ భావాలను, నైతిక విలువలను, సహనం, సహకారం, సమిష్టి బాధ్యతలను సమాజ స్పృహను, స్వయంనిర్ణయాధికార శక్తిని, సమస్యలను ఎదుర్కొనే ఆత్మ స్థైర్యాన్ని, విశాల దృక్పథాన్ని, క్రమశిక్షణను, విజ్ఞానాన్ని, సచ్ఛీలాన్ని, దేశభక్తిని, యువతలో కలుగచేసి పెంపొందింప చేస్తున్నది విద్య. చక్కని నాయకత్వ లక్షణాలను పెంపొందిస్తుంది. స్వాతంత్ర్యోద్యమము కొంతమంది విద్యావంతులైన యువత వలననే ప్రారంభమయింది. సంఘసంస్కరణలు జరిగాయి. విద్యావంతులైన యువత ఆదర్శవంతమైన, ఆరోగ్యవంతమైన, సుఖవంతమైన సమాజ నిర్మాణానికి కృషిచేస్తుంది. అన్ని సమస్యలకు ఒక పరిష్కార మార్గం సమాజాన్ని విద్యావంతుల్ని చేయడం ప్రథమ కర్తవ్యం. విద్యావంతుడైన ప్రతివ్యక్తి ఉన్నతోద్యోగి, ప్రభుత్వోద్యోగి అవ్వాలనుకోవడం పొరపాటు. "పట్టము నందు కోవడం పొట్ట నింపుకోవడానికి కాదు'' అన్న సత్యసాయి అమృతవాక్కులను మనం గుర్తించాలి.

**రూప యౌవన సంపన్నా విశుద్ధ కుల సంభవాః।**
**విద్యాహీనా నశోభంతే నిర్గంధా ఇవకింశుకాః॥**

మనకు స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలు

KOHINOOR
Bangles
GOLD SHEET COVERED
ACID PROOF & CASH REFUNDABLE
ESTD:1901 PHONE:22630
KOHINOOR ROLLED GOLD
COMPANY (Regd)
P.B.No.10, MACHILIPATNAM-521 002 (A.P.)
INDIA
25 YEARS GUARANTEE
BACHI

అయినప్పటికి అక్షరాస్యత శాతం 52.2% ఉంటే స్త్రీలలో అక్షరాస్యతా శాతం 39.29% మాత్రమే. దేశజనాభాలో సగంమంది నిరక్షరాస్యులైతే ప్రభుత్వం యువతకు కల్పించే అభివృద్ధి కార్యక్రమాలను, పథకాలను గానీ సద్వినియోగం చేసుకోలేదు. ఎన్ని సంస్కరణలు చేసినా, ఎన్ని అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టినా నిరుపయోగం, నిరర్థకం. అభివృద్ధి శ్రేణిలో మన దేశం 138వ స్థానంలో ఉంది. ప్రపంచంలోని దేశాలకంటే మనమేం తీసిపోయాం? ప్రపంచ దేశాలేవీ కన్ను తెరవని కాలంలోనే, వేదవేదాంగాలను పారాయణం చేసిన భారతావని. నేటి దుస్థితికి కారణం నిరక్షరాస్యత కాదా! చదువుకునే కాలాన్ని వినోదాలకు, విలాసాలకు వృధా చేస్తున్న వారు కొందరైతే, చదువు'కొనే' స్థితిలో లేని యువత మరి కొందరైతే, బ్రతుకు బాధ్యతను చిన్నతనం నుంచే భారంగా మోసే యువత మరికొంత ఉంది. యువతను తప్పు త్రోవ పట్టిస్తూ తమ స్వార్థ ప్రయోజనాలకు వాడుకునే రాజకీయాల నుండి, అరాచకం, అన్యాయాలు అవినీతి, లంచగొండిని ప్రశ్నించే అధికారాన్ని, అధికారం దుర్వినియోగం కాకుండా చూడాలంటే మన జాతిపిత గాంధీజీ ఆశించిన కలలు నిజం కావాలంటే, జాతీయనాయకుల త్యాగాలకు అర్థం పరమార్థం లభించాలంటే గోముఖ వ్యాఘ్రాలను తరిమి కొట్టాలంటే దేశాన్ని మరల పరతంత్ర పాలన క్రిందకు పోకుండా కాపాడుకోవాలంటే యువత తప్పని సరిగా విద్యావంతులవ్వాలి. నాటి మేటి గద్దెనెక్కి యువతరానికి, నవశకానికి నాంది పలకాలి.

"ఎవరి హృదయం దయతో కూడి ఉండునో, ఎవరి వాక్కు సత్యం చేత అలంకరించబడి ఉండునో, ఎవరి కాయము పరోపకారానికి అంకితమై ఉండునో అట్టి మానవ జీవితము పరిపూర్ణమైనది". పశుపక్ష్యాదుల నుండి మనం నేర్చుకోవలసినది ఎంతైనా ఉంది. అతి హీనంగా చూడబడే గాడిద నుండి సహనాన్ని గ్రహించవచ్చు. సాలెపురుగు తన గూటిని ఎన్ని సార్లు పాడుచేసినా పట్టుదలతో అది గూడు కడుతూనే ఉంటుంది. ఒకసారి తిండి పెడితే ఎన్నిసార్లు ఛీ కొట్టినా కుక్క తన విశ్వాసాన్ని మరిచిపోదు. 'నీతి లేని జాతి కోతి కంటే హీనం' అన్నారు. నీతి లేని యువతవలన దేశానికి మేలు జరగక పోగా, కీడే ఎక్కువ జరుగుతుంది. ప్రతి జీవిలో ఉన్నది దేవుడే. మన ప్రేమ, గౌరవం, దయ అన్నీ ఆయనే. మానవత్వంలోని దైవత్వాన్ని తెలుసుకుంటే అహంకారానికి తావు లేదు. దీనిని గుర్తించిన మనిషి ఇతరులపై ఈర్ష్య పడడు. మానవ దేహమనే దేవాలయంలోని భగవంతుని చూడగలిగిన క్షణంలో ప్రతి మనిషిలోను భగవంతుని చూడగలవు. మనసు నిష్కల్మషంగా ఉంచుకోవాలి. చిత్తశుద్ధి కావాలి. పేద, గొప్ప, స్త్రీ పురుష, భాషా భేదం, మతం, కులం, జాతి, రంగు తేడా లేకుండా మనుషులందరినీ ఒకటిగా సమదృష్టిలో చూడటం యువత అలవాటు చేసుకోవాలి. సత్యం, పవిత్రత, నిస్వార్థం అనే మూడు గుణాలున్న వారిని భూమ్యాకాశాలలోని ఏ శక్తీ నాశనం చేయలేదు. "Help Ever Hurt Never" - సత్యసాయి. మనిషి మనసు చెడు మీదకు పోనివ్వకూడదు. దాని వలన చెడు ఆలోచన, చెడు పని, మనసంతా చెడ్డ అభిప్రాయాలతో నిండి ఉంటుంది. ఈ ప్రభావం మనస్సుపై పనిచేసి మనిషిని చెడుగా తయారు చేస్తాయి. మంచి అభిప్రాయాలు కలిగిఉంటే మంచి పనిని చేయడానికి ప్రేరక శక్తులుగా ఉంటాయి. మంచి ఆలోచనలు చేసే వ్యక్తి చెడుచేయాలని భావించినా తన ప్రభావం లేకుండా మంచి ప్రవృత్తుల ప్రభావంలో పడి మంచే చేస్తాడు. అటువంటి వారే సచ్ఛీలురు. సచ్ఛీలవంతమైన యువతే సమాజానికి కావాలి. "మానవ సేవే మాధవ సేవ" అని ప్రతిమనిషి తనకు తోచిన సహాయాన్ని ఇతరులకు చేయ గలిగితే అంతకు మించిన త్యాగం, ధర్మం, దానం లేవు.

నా అభిప్రాయంలో యువత ముఖ్యంగా గుర్తించాల్సిన అంశమేమనగా - మనకు కనిపిస్తున్న ఈ రంగుల ప్రపంచం వైపు పోవటానికి మనస్సు ఉవ్విళ్ళూరుతుంది. కానీ అది క్షణభంగురమైనది. దానిలోకి దిగిన తర్వాత పైకి రాలేనంత ఊబిలోకి కూరుకుపోతాము. జీవితమే పతనమవుతుంది. మన ఆదర్శం, లక్ష్యం, గమ్యం, గౌరవమర్యాద, పరువు ప్రతిష్ఠలన్నింటినీ దిగజార్చుకొని జీవచ్ఛవంలా బ్రతకాలి. జీవితానికి అర్థం పరమార్థం లేకుండా ఒక చిత్తుకాగితంలా మన జీవితం మారుతుంది. అదే ఒక్క క్షణం ఆగి 'ఏమిటి? ఎందుకు?' అని తర్కించుకొని శాశ్వతమైన ఆనందం, హోదా, ఉన్నత స్థితిని ఊహించుకొని మన జీవితాన్ని ఎటువైపు నడపాలి? ఉన్నత శిఖరాలను అధిరోహించడానికి మార్గమేదో కనుగొనాలి. "ఎవరి బిహేవియర్ సరిగా ఉంటుందో వాడే Boy. " ఎవరి మేనర్స్ సరిగా ఉంటుందో వాడే Man." " ఎవడు డ్యూటిని సక్రమంగా నిర్వహిస్తాడో వాడే Devotee". ఒకరితో ఎప్పుడూ వేలెత్తి చూపించు కొనేటట్లు తన జీవితాన్ని మార్చుకూడదు. పది మందికి ఆదర్శంగా నిలబడి ఉన్నతునిగా పేరు ప్రఖ్యాతులు సాధించాలంటే శీలవంతులై ఉండాలి. శీలవంతులైన యువత వలన సమాజం ఆదర్శంగా ఉంటుంది. ఎదురు తిరిగి ప్రశ్నించే అధికారాన్ని పొందుతుంది." శీలవంతులైన యువత మీదే దేశ భవిష్యత్తు అధారపడి ఉంటుంది." ఆశలు కాదు ఆశయాలు ప్రధానం. చదువుతో పాటు సంస్కారం అవసరం. 'కోపం ఉత్తమునిలో ఒక్క క్షణం' మధ్యముని యందు రెండు ఘడియలు, అధముని యందు ఒక పగలు, రాత్రి, పాపి యందు బ్రతుకున్నంతకాలం ఉంటుంది. బాధలలో ధైర్యాన్ని, ఆపదలో ఆశను, నిరాశలో ధైర్యాన్ని కలిగి ఉండాలి. మొదట వినాలి. అర్థం చేసుకోవాలి. బయట ప్రభావాల నుండి మనస్సు మళ్ళించుకోవాలి. సత్య సంధతను పెంపొందించు కోవడానికి ప్రయత్నించాలి.

**శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః**
**పరోపకార పుణ్యాయ పాపాయ పర పీడనమ్!!**

"అహంకార రహితుడైనప్పుడే ఉత్తమోత్తముడైన యదార్థ వ్యక్తిపై ఉందువు" - 'బుద్ధుడు.' అహంభావమే మనలనావరించి యున్న దుర్భేద్యమైన గోడ. దానిని ఛేదించి ముందుకు నడవగలగే మనిషి మనిషిగా పేర్గాంచుతాడు. " ఆత్మ విశ్వాసం గల కొందరి వ్యక్తుల చరిత్రే ప్రపంచ చరిత్ర" యువతకు ముఖ్యంగా నిగ్రహము అవసరము. నిగ్రహములేని మనస్సు మనలను క్రిందికి లాగి చీల్చిచెండాడును. నిగ్రహింపబడిన మనస్సు మనలను రక్షించును. మనలను స్వతంత్రులను చేయగల్గును. మనుష్యులకు, పశువులకు గల ముఖ్య భేదం ఏకాగ్రతలోని భేదము.

క్రమశిక్షణలేని జీవితం చుక్కాని లేని నావలాగా అలల తాకిడికి అటు, ఇటు ఊగుతూ ఒడిదుడుకులతో ప్రయాణిస్తూ గమ్యం తెలియక ఏకాకిగా కష్టాలకడలిలో జీవితాన్ని గడపాల్సిఉంటుంది. కొన్ని నియమ నిబంధనలతో కూడిన జీవితం అత్యున్నత శిఖరాలను చేరుకొని యువత జీవితాన్ని స్వర్గధామం చేసుకోవడానికి అవకాశం కల్పిస్తుంది. క్రమశిక్షణతో కూడిన జీవితం గల యువకులు సత్ పౌరులుగా బాధ్యతాయుతమైన వ్యక్తులుగా తయారవుతారు. సక్రమమైన, సరియైన, అలవాట్లు, సరియైన వైఖరులను వ్యక్తిలో పెంపొందించి యువతను ఉన్నతునిగా తీర్చిదిద్దేదే క్రమశిక్షణ. వ్యక్తి ఉన్నతునిగా, ఉన్నత ప్రమాణాలకు కట్టుబడి, ఆదర్శవంతుడిగా, మార్గదర్శకునిగా తయారగును. ఎప్పుడైతే యువత ఉన్నత ప్రమాణాలు నిర్ణయించుకోగలదో అప్పుడే దేశపురోభివృద్ధి ప్రారంభమగును. 'రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని స్థాపించగలిగారంటే బ్రిటీషువారి క్రమశిక్షణే అందుకు కారణం. స్టాలిన్, లెనిన్, హిట్లర్, గాంధీజీ, వివేకానంద మొదలగు ప్రముఖ జాతీయనాయకులంతా కీర్తి శేషులుగా, చిరస్మరణీయులుగా చరిత్రలో నిలబడ గలిగారంటే వారు అవలంబించిన క్రమశిక్షణయే. క్రమశిక్షణ లేని జీవితం చిన్నాభిన్నమగును. విద్య ద్వారా క్రమశిక్షణను పాటిస్తూ సచ్ఛీలవంతులై యువత మెలగాల్సిన అగత్యం ఎంతైనా ఉంది. ఈనాటి దేశ పరిస్థితికి కారణం యువతలో నిర్వీర్యమై పోతున్న క్రమశిక్షణ. ఒక ప్రణాళిక ఉండదు. నియమం ఉండదు. "గుడ్డెద్దు చేలో పడ్డట్టు" ఏదో మార్గంలో పోవడానికి పట్టుదొరికితే సరే, లేకుంటే నిరాశ చెంది టెర్రరిస్టులవటం కాదు యువతకు కావల్సింది. క్రమపద్ధతిలో ప్రణాళిక వేసుకొని దానికి కావలసిన వాటిని

సిల్వర్ జూబిలీ జరుపుకున్న సంస్థ స్థాపితం:1964
శ్రీ
నగలు
22C.T. బంగారు కవరింగ్ చేయబడినవి.
ఆఫీస్ ఫోన్ నెం: 2785
ఇంటి ఫోన్ నెం: 2235
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్స్®
P.B.No 135 శ్రీమహల్, మచిలీపట్నం-2.

సమకూర్చుకొంటే సాధించలేనిది ఏమీ ఉండదు. "సామాన్య మానవుడు తన ఆలోచనాశక్తిని నూటికి తొంబది తొమ్మిదిపాళ్ళు వృథా చేయుచున్నాడు. సుశిక్షితుడైన మానవుడు ఎప్పుడూ తప్పుచేయడు" - వివేకానంద. క్రమశిక్షణ కలిగిన యువత నిర్మాణాత్మకమైనదిగా, వాస్తవమైనదిగా ఉండును. యువతలో Positive Thinking అలవరుచుకోవాలి. సాధనకు నిష్టయే ఉపాయము.

దేశపౌరులు గొప్పవారు. సచ్ఛీలురు, క్రమశిక్షణ కలిగినవారు, విద్యావంతులైనవారు అయితే ఆదేశం గొప్పది, మంచిది అవుతుంది. ప్రపంచ సంపదకంటే సచ్ఛీలురు క్రమశిక్షణ కలిగిన మానవులే దేశానికి అతివిలువైన సంపద. తన సర్వస్వాన్ని దేశం కోసం త్యాగం చేసిన త్యాగధనులెందరో ఉన్నారు. వారే మనకు ఆదర్శం. ప్రాణాలను సైతం లెక్కచేయక ఆనందంతో ఉరికంబానికి ఊయలలూగిన భగత్ సింగ్, రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని తన అహింసా సిద్ధాంతంతో గడగడ లాడించిన గాంధీజీ, కొదమ సింహంలా ముందుకు ఉరికి మన్నెం దొరగా పేర్గాంచిన అల్లూరి బ్రిటిష్ దొరల తుపాకీకి తన శరీరం తూట్లు పడితే ప్రతి రక్తపు బొట్టు నుండి మరొక అల్లూరి పుడతాడన్న అల్లూరి సీతారామరాజు, గుండుకు గుండె చూపి కాల్చండిరా దమ్ముంటే అన్న ఆంధ్రకేసరులకు మనం వారసులం కాదా! వారి అనుయాయులం కాదా! వారే మనకు ఆదర్శం.

ఉత్సాహం, సాహసం, ధైర్యం, బుద్ధి శక్తిః పరాక్రమః!
షడైతే యత్ర తిష్ఠంతి తత్రదేవోపి తిష్ఠతి!!

"ఏ దేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని" అన్న రాయప్రోలు సుబ్బారావుగారి ఆశయాలతో గళం కలిపి దిక్కులు పిక్కటిల్లేటట్లు నవయువతరం చాటాలి. భారతీయ యువజన నాయకుడైన స్వామి వివేకానంద చెప్పినట్లుగా ఇనుప కండరాలు, ఉక్కు నరాలు, వజ్రంలాంటి మేధస్సు యువతకు కావాలి. బలహీనుల మనుకుంటే బలహీనులమే, బలవంతులనుకుంటే బలవంతులమే. ఒక వ్యక్తిగాని, జాతిగాని తన యందు తనకు విశ్వాసం ఎప్పుడు కోల్పోవునో ఆ జాతి మరణించినట్లు లెక్క. క్రియా పరతంత్రుడును, సింహ సదృశ్య ధైర్యహృదయుడు అయిన యువతనే విజయం వరించును. అంతులేని శక్త్యుత్సాహములు, ఎనలేని ధైర్యము, ఒట్టిపోని ఓరిమితోనే ఘనకార్యాలు సాధ్యమగును. "నిరాశచెందవచ్చు. సాగవలసిన బాట కత్తి అంచున ఉన్న బహు కష్టసాధ్యము అయిననూ అధైర్య పడవలదు. జన సామాన్యము నిన్నేమయినా అననీ, నీ దృఢ నిశ్చయమునే అంటిపెట్టుకొని యుండుము. ఒక్క అడుగయినా వెనుకకు వేయవద్దు." భాయీ భాయీ అంటూ సమసమాజం కోసం నవతరం నడుం బిగించాలి. కులతత్వం, మతతత్వం, వర్గవైషమ్యాలతో, జాతివిభేదాలతో కొట్టుమిట్టాడుతున్న భారతావనికి స్వేచ్ఛా సమానత్వ వాతావరణాన్ని సృష్టించి, పూర్వవైభవాన్ని ఔన్నత్యాన్ని తిరిగి తీసుకువచ్చే బాధ్యత యువత భుజస్క... పై ఉంది. నీది, నాది అనేది మరచి మనది అనే భావం కల్పించి జాతీయ సమైక్యత సమాజంలో కల్పించాలి. "దేశ సేవకంటే దేవతార్చన లేదు" అహర్నిశలు శ్రమించి సరిహద్దులు పహారాకాస్తున్న సైనికుల్లా ప్రతి యువకుడు, యువతీ సమాజంలో పరిస్థితులు అవగాహన చేసుకుంటూ ఎప్పటికప్పుడు సహాయ సహకారాలు

అందించాలి. "దేశం నాకేమిచ్చింది అనే దాని కన్నా దేశానికి నేనేమిచ్చాను." అనే భావం యువతలో ఉండాలి. పెచ్చు పెరిగిన ఉగ్రవాదం వలన ఒరిగేదేమిటి? జన నష్టం, ధన నష్టం, నిరంతరం భయం, భయం. అమాయకపు ప్రజల బలి. దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవలసిన అగత్యం ఎంతైనా ఉంది. " ఒక్కొక్క నీటి బొట్టు కలిసి మహాసముద్రము అవుతుంది. మన పూర్వీకులు మనకు అందించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, నాగరికత, సంస్కృతి, ఐకమత్యం, సహకారాలను మన ముందుతరానికి అందించాల్సిన బాధ్యత యువతపై ఎంతో ఉంది. మూఢ - నమ్మకాలను, దురాచారాలను విడనాడి మానవాళి అభివృద్ధికి తోడ్పడుతున్న విజ్ఞాన శాస్త్ర అభివృద్ధికి కృషి చేయాలి. విశ్వం యొక్క రహస్యాలను ఛేదించి కంప్యూటర్ యుగాన్ని సృష్టించి యంత్రాలపై మంతనాలు జరిపే నాగరికత జీవనానికి విజ్ఞాన శాస్త్రం గాలులను వీస్తున్నది. యువత విజ్ఞానవంతులై ముందు తరాలకు మరింత విజ్ఞానాన్ని అందించడానికి కంకణం కట్టుకోవాలి. ప్రతిరోజు ఆత్మ విమర్శ చేసుకో. ప్రతి ఉదయం సద్భావనతో బయలుదేరు.

**ముగింపు** - పిరికివాడు సమాజం తన మీద విసిరే రాళ్ళకు భయపడి పారిపోతాడు. ధైర్యవంతుడు ఎదురు తిరుగుతాడు. కానీ తెలివిగలవారు ఆ రాళ్ళతోనే తమకు కావలసిన సౌధాన్ని నిర్మించుకుంటారు. అధముడు ఏ పనీ ప్రారంభించడు, మధ్యముడు ప్రారంభించి వదిలేస్తాడు, ఉత్తముడు ప్రారంభించి కడవరకు సాగించి సాధిస్తాడు. పోరాటములను, పోరుబాట్లను ఎన్నడూ పట్టించుకోవద్దు. అపజయాలకు వెనుకంజ వేయవలదు. ప్రయత్నంలో వెయ్యిసార్లు అపజయమొచ్చినా విడువడక మరొకసారి ప్రయత్నించాలి. ఏ పని అయినా మొదట అవహాస్యం వ్యతిరేకత, ఎదుర్కొని తర్వాత ఆదరించబడును. యువత విశాల దృక్పథంతో, విద్యావంతులై, చక్కని నియమ నిబంధనలను ఏర్పాటు చేసుకొని, శీలవంతులై, దేశభక్తి పూరితులై దేశసౌభాగ్యాన్ని పెంపొందించేందుకు దోహదం చేయాలి. నా వల్ల కాదు అని ఊరుకోకూడదు. ఏ పనైనా ఎవరో ఒకరితో ప్రారంభం కావాలి. అది నువ్వే కావచ్చు. ఐకమత్యంతో సమిష్టి సహకారంతో ఒకరినొకరు అర్థం చేసుకొని ముందుకు నడవాలి. అప్పుడే ప్రపంచదేశాల్లో భారతజాతికి, భారతమాతకు గౌరవం. భారతమాత ముద్దు బిడ్డలమై చిరస్మరణీయులమగుదాం. నవయువతా మేలుకో. యువశక్తిని వెలికితీయి. శంఖంపూరించు. జనవాహిని ప్రారంభించు. ఇదే నా సందేశం యువతకు. కదంకదం కదుపుతూ పదంపదం పాడుతూ స్వాతంత్ర్యోద్యమాన్ని మరిపించేటట్లు అభివృద్ధి ఉద్యమాన్ని సాగించు. శుభోదయం. శోధించి సాధించడమే ధీరగుణం. ●

## ఆర్. ఎస్. కె.

## విజేతలు

'శ్రీవాణి' నిర్వహించిన ఆర్. ఎస్. కె. స్మారక వ్యాసరచన పోటీలలో ప్రథమ బహుమతిని పొందిన సి. హెచ్. కనకదుర్గ, కూచిపూడి గారికి నగదు రు.250/-లు, ద్వితీయ బహుమతి పొందిన శ్రీ బండ్రెడ్డి రాముడు, మర్రిపాలెం గారికి రు.150/-లు, తృతీయ బహుమతి పొందిన శ్రీ ఎ. వి. హెచ్. ప్రసాద్, కలిదిండి గారికి రు.100/-లు ది. 17-1-1998 మచిలీపట్నం టౌనుహాల్‌లో జరిగిన 'భాగ్యనగర్' 42వ జన్మదినోత్సవ సభలో శాసన సభ్యులు శ్రీ అంబటి బ్రాహ్మణయ్యగారు నగదు బహుమతులను అందజేసినారు.

రాష్ట్రం నలుమూలలనుండి వచ్చిన వ్యాసములను పరిశీలించి ఉత్తమ వ్యాసములను ఎంపిక (ప్రథమ, ద్వితీయ, తృతీయ) చేసిన ప్రముఖ సాహితీ వేత్తలు డా. మాదిరాజు రామలింగేశ్వరరావు, శ్రీ సోమంచి రామం, శ్రీ దివాకర్ల వెంకటేశ్వర్లుగార్లకు మా అభినందనలు.

ప్రథమ బహుమతిని పొందిన వ్యాసమును పాఠకులకు అందిస్తున్నాము. ద్వితీయ, తృతీయ బహుమతులను పొందిన వ్యాసములు రాబోవు సంచికలలో ముద్రించబడుతాయి.

సం॥

### ఆయుర్వేద వైద్య పునరుద్ధరణకు మహోద్యమం నడపిన

# గోపాలాచార్యులు

దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో ప్రభువులూ, విద్యావంతుల నిరాదరణకు గురయి కృశించి పోయిన ఆయుర్వేదానికి పునరుజ్జీవనం చేసి ముగ్గురు ప్రముఖులలో పండిత దివి గోపాలాచార్యులుగారు ప్రథమ గణ్యులు. మిగిలిన ఇద్దరూ ఆచంట లక్ష్మీపతి, కె.ఎన్. కేసరిగార్లు.

గోపాలాచార్యులుగారిది ఆకట్టుకునే రూపం. ఠీవిని పెంచే తలపాగా, పండితుడన్న భావం కలిగించే గడ్డం, పవిత్ర భావాన్ని ఇనుమడింప చేసే నామాలు వివిధ సందర్భాలలో ప్రదానం చేయబడిన స్వర్ణపతకాలలో శోభించే లాంగ్ కోటు. ఆయుర్వేద పునరుద్ధరణే తన జీవిత ధ్యేయంగా ఎంచుకున్న కర్మయోగి గోపాలాచార్యులుగారు.

స్వస్థలం దివితాలూకాలోని భావదేవరపల్లి గ్రామం. పుట్టిందీ, బాల్యం గడిపిందీ బందరు రామానాయ్డు పేటలోని మాతామహుల ఇంట. జీవితంలో ఏదో సాధించాలన్న తపన. దేనికోసమో అన్వేషణ. గోపాలా చార్యులుగారిని బాల్యంలో ఇంట్లో కుదురుగా నిలువనీయ లేదు. అందుకనే 13వ యేటనే తిరుపతికి వెళ్ళిపోవడం అక్కడ మూడు సంవత్సరాలు విద్యాభ్యాసం చేసి తిరిగి భావదేవరపల్లికి జేరినా నిలకడ లేకపోయింది. పెళ్ళి చేస్తేనయినా ఇంటి పట్టున ఉండి పోతాడన్న ఆశతో పెద్దలు మేనమామ కూతురిని ఇచ్చి పెళ్ళి చేశారు. అయినా సాంసారిక జీవితం ఆకర్షించలేక పోయింది. చెప్పకుండా చేయకుండా తిరుపతికి మళ్ళీ వెళ్ళిపోయారు. అక్కడ నేపాలీ రాజకుంటుంబానికి చెందిన ఒక మహాతపస్వి సాంగత్య భాగ్యం లభించింది. వారి వద్దే మంత్రోపదేశం పొందారు. ఆ ఆధ్యాత్మిక గురువుతో హైదరాబాదు చేరుకున్నారు. గోపాలాచార్యులు తల్లిదండ్రులకు తెలుపకుండా వచ్చేసినట్లు గురువుగారికి తెలిసింది. 'ఇది తగదు నాయనా' అంటూ గురువుగారు బందరులో విడిచారు. కాని గోపాలాచార్యులకు ఇంట్లో మనశ్శాంతి లేకపోయింది. తన అన్వేషణ సఫలం కాలేదు. అలనాడు సిద్ధార్థుని మాదిరిగా గోపాలాచార్యులు - ఒక అర్ధరాత్రి భార్యను తల్లిదండ్రులను విడచి తన జీవిత గమ్యాన్ని వెదుక్కుంటూ మరోసారి తిరుపతికి చేరుకున్నారు. అక్కడ నిలువలేకపోయారు. ఆ సమయంలో మైసూరులో ఆయుర్వేదం, సంస్కృతాలను బోధించే కళాశాల వుందని అక్కడకు వెళ్ళమని కొందరు సలహాలు యిచ్చారు. ఆ సలహా ఆయన జీవితాన్ని పెద్ద మలుపు తిప్పింది. జీవిత లక్ష్యమేమిటో తెలిసి వచ్చింది.

## కంచి వాసుదేవరావు

### ఆయుర్వేదంలో ప్లేగు నివారణ

మైసూరు ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ అయుర్వేద వైద్యనిష్ణాతుడు అగరం పుట్టస్వామిగారు. ఆయన దగ్గర గోపాలాచార్యులు శిష్యరికం చేశారు. అప్పటికి గోపాలాచార్యులు వయస్సు 16 సంవత్సరాలు. ఈ శుశ్రూష నాలుగు సంవత్సరములు జరిగింది. ఈ శిక్షణలో భాగంగా దేశం నలుమూలలా పర్యటించారు. కలకత్తా, కాశి, బొంబాయిలలో ఉంటున్న ఆనాడు ప్రముఖ అయుర్వేద వైద్యులను పండితులను కలుసుకున్నారు. వారితో శాస్త్ర విషయాలను చర్చించారు. తిరిగి మైసూరుకు వచ్చారు.

1895లో మైసూరులో ప్లేగువ్యాధి ప్రభవించి అనేక మంది మరణించారు. అప్పటి మైసూరు ప్రభుత్వం యువకుడైన గోపాలాచార్యుల ప్రతిభను గుర్తించి ఈ వ్యాధిని ఎదుర్కొనే ప్రధాన వైద్యాధికారిగా నియమించింది. ప్లేగువ్యాధికి శక్తివంతమైన ఆయుర్వేద ఔషధాలు ఉన్నాయని గ్రహించిన గోపాలచార్యులు వారంలో ఆ మహమ్మారిని అదుపుచేసి అందరి ప్రశంసలను పొందారు.

కాని గోపాలచార్యులు మైసూరులో నిలవలేక

పోయారు. తన ఆశయసాధనకు మద్రాస్ నగరం సరి అయిన స్థలమని భావించారు. కేవలం రెండు రూపాలయకే మద్రాసు చేరుకున్నారు. అక్కడ ఆయుర్వేద వైద్యునిగా ప్రాక్టీస్ ప్రారంభించారు. హస్తవాసి, ప్రతిభ ఉన్న వైద్యునిగా త్వరలోనే గుర్తింపు, గౌరవం లభించాయి. అప్పటికి ఆయన వయస్సు 25 సంవత్సరముల లోపు. బందరు నుంచి కుటుంబాన్ని తెచ్చుకున్నారు. గత శతాబ్దం మద్రాసులోని శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానం వారు ఒక ఆయుర్వేద ఆసుపత్రిని స్థాపించి దానికి గోపాలాచార్యులుగారిని ప్రధాన వైద్యులుగా నియమించారు. ఈ ఆసుపత్రి ఆయుర్వేద కళాశాలగా మారింది. ఐతే ఆ కళాశాలను, ఆసుపత్రిని దేవస్థానం వారు నిర్వహించలేకపోవడంతో ఆచార్యులుగారు ఆ కళాశాల నిర్వహణ బాధ్యతను స్వయంగా చేబట్టారు. ఆయుర్వేద ఔషధాల తయారీనీ ఆయుర్వేదాశ్రమాన్ని స్థాపించి - జీవామృతం వంటి అనేక ప్రసిద్ధ ఆయుర్వేద ఔషధాలను తయారుచేశారు. 1905లో ఈ ఆయుర్వేద కళాశాలనుంచి మొట్టమొదట వట్టభద్రులు తయారయ్యారు. ప్రముఖ ఆయుర్వేద వైద్యులు, సంస్కృత పండితులు అధ్యాపకులుగా నియమితులు కావడంతో ఈ కళాశాల ఉన్నత ప్రమాణాలను నెలకొల్పింది. అప్పటి నుంచి 1920లో మధుమేహ వ్యాధితో అకాలమరణం చెందే వరకు ఆయుర్వేద వైద్య వ్యాప్తి ఏకైక జీవితధ్యేయంగా భావించారు. మరణించడానికి ఒక ఏడాది ముందు ఆయుర్వేద వైద్యవ్యాప్తికి 'ధన్వంతరి' అనే పక్షపత్రికను స్థాపించారు.

## రాష్ట్ర సరిహద్దులు దాటిన కీర్తి ప్రతిష్టలు

ఆయుర్వేద వైద్యునిగా గోపాలాచార్యులుగారి కీర్తి ప్రతిష్టలు రాష్ట్ర సరిహద్దులను దాటి హిమాలయ పర్వతాల వరకు వ్యాపించాయి. కోరుకోకుండానే అనేక సన్మానాలు, బిరుదులూ లభించాయి. గద్వాల్, కలకత్తా, వారణాసి, బొంబాయిలలో ఆయనకు సన్మానాలు జరిగాయి. భిషగ్మణి, ఆయుర్వేద మార్తాండ అనేవి ఒక ఎత్తు అయితే ఆనాటి బ్రిటీష్ చక్రవర్తి ఐదవ జార్జి ప్లేగు వ్యాధి నివారణకు గోపాలాచార్యులుగారి కృషికి గుర్తింపుగా ఇచ్చిన 'వైద్యరత్న' బిరుదు మరొక ఎత్తు. ఆరోజులలో దేశస్థాయిలో ఏ ఆయుర్వేద సమ్మేళనం జరిగినా గోపాలాచార్యులుగారు అధ్యక్షత వహించవలసిందే. 1917లో ఇప్పటి పాకిస్తాన్‌లోని ప్రధాన నగరమయిన లాహోరులో మహర్షి దయానంద ఆయుర్వేద కళాశాలను స్థాపించారు. దీన్ని ప్రారంభించ వలసిందిగా వ్యవస్థాపకులు గోపాలాచార్యులు గారిని కోరారు. తెలుగువారందరినీ హర్ష పులకాంకితులను చేయగల ఈ సంఘటనను తిరుమల రామచంద్రగారు 'హంపీనుంచి హరప్ప' వరకు అన్న వ్యాస పరంపరలో ఇలా వివరిస్తారు.

నేను 1939లో లాహోరు వెళ్ళాను. ఒకనాడు ఊరు చూస్తూ దయానంద ఆయుర్వేదిక కాలేజీ అనే నామ ఫలకం చూసి ఆగాను. ఆవరణ ద్వారం మీద ఫౌండేషన్ స్టోన్ మీద ఎయిడ్ బై వైద్యరత్న పండిత డి. గోపాలాచార్య అని చెక్కిన చలువరాతి బండ ఉంది. దానిని చూస్తూ ఒక తెలుగువాడు. ఇంతదూరాన ఉన్న ఆయుర్వేద కళాశాల భవనానికి శంఖుస్థాపన చేయడమా అని ఆశ్చర్యానందాలతో అలాగే నిలబడ్డాను. భవనం లోపల నుంచి ఒక సమున్నత శరీరుడయిన స్ఫురద్రూప పంజాబీ తలపాగా పైజామాలలో వచ్చి నన్ను చూసి 'ఖ్యా దేఖ్ రహే హై' అని ప్రశ్నించారు. ఈ శంఖుస్థాపన చేసిన మహనీయుడు నా ప్రాంతం వాడు. ఆనందంతో ఆయన పవిత్ర నామధేయం చూస్తున్నాను' అన్నాను. "ఓహ్! అయితే తమరు మా గురువుగారి ప్రాంతం వారు. లోపలికి దయచేయండి అంటూ తలపాగా తీసి నా ముందు పెట్టి వంగి నమస్కరించారు.

ఒకప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం ఆయుర్వేదాన్ని చాల చులకన భావంతో చూచేది. దాన్ని నిషేధించాలని అది అశాస్త్రీయమని నిరూపించడానికి ఒక కమిటీని కూడా ఏర్పాటు చేసింది. ఆయుర్వేద ఔషధాలు ఎందుకూ పనికి రావని ప్రచారం చేసింది. ఈ తప్పుడు ప్రచారాన్ని గోపాలాచార్యులుగారు అసహాయ శూరునిగా ఎదుర్కొన్నారు. ఆయుర్వేద వైద్య ప్రచారానికి ఆయుర్వేద కాంగ్రెస్‌ను స్థాపించి ఇప్పటి బర్మాలోని రంగూను నుంచి ఆఫ్ఘనిస్తాన్‌లోని కాబూలు వరకు విస్తృత ప్రచారం చేసి దాని వైశిష్ట్యాన్ని చాటారు. అనేక ప్రామాణికమైన అనేక ఆయుర్వేద గ్రంధాలు రచించారు.

నోట్లు ఆయనవి, చిల్లర కాంపౌడరుది

ఆయన మద్రాస్‌లో ఆయుర్వేద వైద్యుడు మద్రాస్‌లోని ఆనాడు బ్రిటిష్ ప్రముఖ వైద్యులతో సమానంగా కన్సల్టేషన్ రుసుం" తీసుకునే వారంటే ఆయనకు గల పేరు ప్రఖ్యాతులు వెల్లడవుతాయి. ఆయన దగ్గర కె. నరసింహం అనే ఒకరు కాంపౌండరుగా పనిచేసేవారుట. ఆయనకు నెలజీతం ఏమీ ఉండేది కాదు. ఏరోజుకారోజు వచ్చిన సంపాదనలో రూపాయలు గోపాలాచార్యులు గారికి చిల్లర కాంపౌండరుకు లభించాలి అన్నది ఇద్దరిమధ్య ఒప్పందము. ఆ చిల్లర మహాలక్ష్మితో కాంపౌండరుగా సంసారం సుఖంగా గడవడమే కాక మద్రాస్ నగరంలో ఆస్తులు సంపాదించు కున్నారని చెప్పుకుంటారు.

గోపాలాచార్యులుగారికి ఇంగ్లీషు ఒంటబట్టలేదు. కాని నాలుగు దక్షిణాది భాషల్లోనే కాక హిందీ, బెంగాలీ, మరాఠీ, ఉర్దూ భాషలలో సైతం అనర్గళంగా మాట్లాడ గలిగిన పండితులు.

గోపాలాచార్యులుగారు కారణజన్ములు. ఒక వ్యక్తి కాదు. ఆయుర్వేద వైద్య ప్రాశస్త్య పునరుద్ధరణకు నడుం కట్టిన మహోద్యమం. ఒక మహాశక్తి. ఆయన డబ్బును దాచుకోలేదు. ఆయన యిల్లు అతిథి అభ్యాగతులతో కళకళలాడుతూ ఉండేది.

1972లో బందరులో ఆయన శతజయంతి జరిగింది. తర్వాత యధాప్రకారం బందరు స్మృతి పథం నుంచి గోపాలాచార్యులుగారు మరుగున పడ్డున్నారు. తమ వారి గొప్పతనాన్ని తాము గుర్తించకపోవడం తెలుగు వారికి వెన్నతో పెట్టిన విద్యే కదా!

## పదాల పందిరి - 8 సమాధానాలు

అడ్డం : 1. ఏలిక, 3. పావని, 5. రిపుడు, 7. దిశ, 9. వేషం, 10. రమ, 11. హృది, 12. ప్రాణం, 14. కవి, 16 సోదరి, 18. ముగింపు, 19. గరళం

నిలువు : 1. ఏడాది, 2. కరి, 3. పాడు, 4. నిముషం, 6. పుట్ట, 8. శరణం, 9. వేదిక, 12. ప్రాయము, 13. గద, 15. విరాళం, 16. సోపు, 17. రిగ

# పదాల పందిరి - 9

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | X | 3 | | 4 |
| | X | 5 | 6 | | X | |
| 7 | 8 | X | | X | 9 | |
| X | 10 | | X | 11 | | X |
| 12 | | X | 13 | X | 14 | 15 |
| | X | 16 | | 17 | X | |
| 18 | | | X | 19 | | |

ఆధారాలు :

అడ్డం : 1. ఆలింగనం, 3. బి.జె.పి. వారి గుర్తు, 5. ఇంటి ముందు మామిడాకుల వరుస, 7. భువి కాదండీ, 9. పెద్ద పొయ్యి, 10. దేహంలోని అతిథి, 11. శరీరం, 12. ఇమాజినేషన్, 14 ఏనుగు, మూడడుగులా!, 16. జమాను కాదండీ, లోకం!, 18. 'ల' త్రయం, 19. బంతి, ఎటునుంచైనా ఒకటే.

నిలువు : 1. కాముని పున్నమి ఉత్సవం, 2. ఒక రకమైన ప్రింటింగ్, 3. కరణం మధ్యలో పోతే అణువా?, 4. ఒక ఆటవిక తెగ, 6. ఇంట గెలిచి..........గెలవాలి, 8. జనక మహారాజు రాజ్యం, 9. నూనె కావాలంటే ఇక్కడకు వెళ్ళాల్సిందే, 12. క్రాడిల్, 13. ఇన్సూరెన్స్, 15. నక్క, 16. చివరపోయినా అర్థం మారని జలం, 17. స్వర్గం

-కిరీటి

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

## అనూహ్యము - అగోచరము

### ప్రొఫెసర్ సూరి భాగవంతం

నేనడిగిన రాబోవు ప్రశ్నలు సామాన్యమైన తర్క హేతువాదముల నుండి మానవుడు తన విశ్వాసమును కాలగమనమున ఎట్లు వృద్ధి పొందింప చేసినాడు, భారత దేశ సాంప్రదాయముననుసరించి భగవంతుని అవతారములు ఒకదాని పిదప వేరొకటి ఎట్లు కల్గినవి అను విషయములపై గూర్చి ఉన్నవి.

భగవద్గీతకు అర్థము హృద్గమముగ తెలియ జెప్పుట, ధర్మమార్గములను ప్రశంసించుచు, వానిని ఉన్నత విధానముల అమలు సల్పుటయు, అనేక మహిమలను ప్రదర్శింప గల్గుట, నాటి నుండి నేటి వరకు ఎంతయు పరపతి చెందిన మహాత్ములకే చెల్లును. శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు చేసిన మహత్తర కార్యములు, వారి అవతారములు అనేకం ఉన్నవి. అయ్యవి చరిత్ర బద్ధముగ కూడా నిరూపింపబడుచున్నవి. అవి ధర్మ మార్గమును అనుసరించుట, బోధించుటను తెల్పుచున్నవి.

**పరిమితిలేని అనంత శక్తి :**

మానవుడు తనకు తెలిసిన ఖండ జ్ఞానముతో, దానికి భిన్నమైన విషయములను వేరొక కొలతబద్దతో, గణింపజూచుట అవివేకము. మహాత్ముల జీవన విధానమును పరిగణింప జూచుట, వారి వేర్వేరు పద్ధతులను అర్థము చేసికొన జూచుట అనేకములైన వివాదములకు త్రోవదీయును. మనము అవతారములను అర్థము చేసికొనవలయును. వాడివి గుర్తించుట మన మధ్య అవతరించిన అవతార పురుషుని ఎరుంగుటెట్లు అను విషయములను తెలియవలయును.

ఈ విషయము సామాన్యమైనది ఎంత మాత్రముకాదు. కారణము మన ప్రకృతి రహస్యములను అరయుటకు నేడు మన వద్ద గల సాధన సంపత్తి ఈ మహత్తర (ఆధ్యాత్మిక) కార్యమునకు సరిపడబోదు.

కాని ఒక్క విషయము గమనింపవగును. సామాన్య మానవులు నిరంతర సాధన వలన మహాత్ములను పొందగల్గుచున్నారు. అవి నియమిత మాత్రములే. మరి అవతారమెత్తిన మహనీయుని యందు అద్భుత శక్తులు (ప్రయత్నములేకనే) జన్మతః సంక్రమించును. ఆ మహత్తర శక్తులు నియమితములు కావు.

## మూలం : ఆర్. కె. కరంజియా
## అనువాదం : డా॥ రాపర్ల జనార్ధనరావు

**దైవ కృప ఇంద్రజాలము కాదు :**

భారతదేశము నందు దొంగ సాధువులు, సన్యాసులు అనేకులను చూచుచున్నాము. వారు చేతులు త్రిప్పి అనేక ఇంద్రజాలపు ట్రిక్కులు చేయుట, సిద్ధ క్రియలు, యోగక్రియలు చేయుచు భగవదవతారములుగా తెలియబడుచున్నారు. ధాన్యమును పొల్లు నుండి విడదీయుటకు కొంత ప్రయత్నము కావలయును గదా! తొందరలోనున్నను గుడ్డివాడైనను మంచినీటి నుండి చెడు నీటిని గుర్తించుట ఎటుల కష్టమో అనుభవము లేకుండుట వలన కూడా ఇది ఎటుల జరుగలేదో అటులనే సామాన్య మానవులు నిజమైన దైవరూపులను, ఇంద్ర జాలికుల నుండి విడదీయుట కష్టతరమైనది. ఇది నిజమైన జ్ఞానము లోపించుటవలన జరుగును.

దైవత్వము, దైవభక్తి అడిగిన వెంటనే వండి వడ్డించెడి విషయములు కావు. బజారులో కొనెడి వస్తువులు కావు. అవి ఆధునిక శాస్త్రజ్ఞానమున ఏవేవో కొన్ని రసాయన పదార్థములు కలిపి లేబోరేటరీలలో తయారు చేయు వస్తువులు కావు, దేవుని కృపారక్షణలో చేరుటకెంతో నిరంతర కృషి కావలసియుండును.

అనంత శక్తి, ఏదో స్వల్ప శక్తి క్రియలతో, ఏదో ఒకానొక సందర్భమున, ఏవో అసత్యజనిత శక్తులతో, ఎవరో

ఏదో ఒకరీతి చూపవలెనని అడిగినదానికి సమాధానముగ ప్రదర్శించేడిది కాదు. దైవ కృపయనునది బజారులో మున్సిపాలిటీ, లేదా ఒక సంస్థ ఏర్పాటు చేసిన యంత్రములో నాణెమువేచి లాగినచో వచ్చెడి వస్తువు కాదు.

**అది వర్ణింపనలవికాని అద్భుతము :**

ఇచ్చట ముఖ్యముగ గ్రహింపవలసినది శ్రీ సత్యసాయిబాబా పెద్దగా పాఠశాలకు పోయి విద్య నభ్యసించలేదు. అయినను ఏదైనా విశదీకరించుటకు అలవికాని పారమార్థిక విషయమును ఆయన అత్యంత సులభముగ సల్పుట ఆశ్చర్యదాయకము. ఆయిన తీవ్రమైన ధ్యానముగాని, సాధనలుగాని చెప్పదగినవానిని ఏవియు చేయరు. కాని వారు చేయు అద్భుత క్రియలు వర్ణనాతీతములు. వెన్వెంటనే చేసెదరు. ఎప్పుడువాంఛించిన అప్పుడే చేయుదురు. తన క్షేమమునకై తానెప్పుడు కష్టించరు. కాన నిరంతరము తన భక్తులకు పరుల యోగ క్షేమమునకై కృషి సలుపమనెడి సందేశము నిచ్చి కర్తవ్యోన్ముఖులు గావించెడి కార్యక్రమమును ఎంతయో పరిపూర్ణతతో స్వామి సల్పెదరు. పని చేయుటయే పరమాత్మ సేవయనెడి ప్రధాన సందేశమును అందించెదరు. అన్నిటికన్న మిన్నగ స్వామి యెన్నడును సైన్సు, విద్య, రాజకీయుతులు, మొదలైన నేటి విషయచతురతలు పరిశీలించలేదు. కాని క్షణమున ఆ విషయులందలి లోతుపాతులు ఇట్టే గ్రహించి తనకెదురుగనున్న వ్యక్తి సాధకబాధకములు ఆకళింపు చేసికొని సరియగు సమాధానమీయగలరు.

ఈ విశిష్ట లక్షణములన్నియు బాబాకు అయ్యవి ఎంతో సహజ లక్షణములుగ విలసిల్లు చుండును. అయ్యవి ప్రత్యేకముగ కన్పింపవు. అది ఒక వర్ణింపనలవికానివి చిత్రాలక్షణములు. హేతువాద పరిగణనకు అతీతము.

లోగడ అనేక పర్యాయములు తెల్పినటుల, బాబా సల్పెడు క్రియలు సవినయముగా తెల్పుటయే నా ప్రధానోద్దేశ్యము. ఆ క్రియలను ఏదో విశ్లేషించి వానికి భాషారూపమొసంగుట నా ఆశయము కాదు వానికి విలువలు కల్పించుట, మన ప్రపంచరీతుల వానికి భాషారూపమొసంగుట, నా ప్రయోజనము కాదు.

*(ఈ వ్యాసం "బ్లిడ్జ్" పత్రిక సెప్టెంబరు 4, 1976 సంచికయుందు ప్రచురితమైనది.)*

## అనుబంధము - 2

## సాయిబాబా ఒక పరిశీలన

రచన - ఏ. రాయ్

జనవరి 30, 1975 నా మొదటి పుట్టపర్తి సందర్శనం. భక్త సముహము నుండి బాబా నన్ను చూచి ఇంటర్వ్యూకు రమ్మనమని తెల్పారు. ఈ ఆకస్మాత్తుగా వచ్చిన అవకాశమునకు నేను నిజముగ సిద్ధపడలేదు.

మందిరంలో కుడిప్రక్కన ఆత్రుతతో వేచియున్నప్పుడు అచ్చట ఇరువురు వ్యక్తులను తేలికగ గుర్తించగలిగాను. వారివురు న్యూయార్క్ నుండి వచ్చిన మానవాతాతీత శక్తుల శాస్త్రజ్ఞులు. వారు ఏలియాండర్ హెరాల్డ్‌సన్, కర్లిస్ ఒసిస్. వీరివురు తరచుగ ఆశ్రమము వద్ద తమ విచిత్ర కార్యక్రమాల ద్వారా చాలామందికి తెలిసిన వ్యక్తులే. వీరు నా ప్రక్కనే కూర్చున్నారు.

కొన్ని ఉత్తరాలు మాత్రం వ్రాసి ఏవో తొందరపాటు నిర్ణయాలు తీసికొనిన డాక్టర్ నరసింహయ్య వలెగాక, ఆ ఇద్దరూ శాస్త్రజ్ఞులు ఇచ్చటకు వచ్చి, న్యాయ విధానమున సత్య నిరూపణ గావించయత్నించుట ముదావహము. సత్యసాయిబాబా గూర్చి అమెరికా యందు ప్రచురితమగుచున్న విషయములు నిజములా? కావా? యను విషయాన్వేషణకై వీరు వచ్చియున్నారు.

షుమారు మూడు మాసముల నుండి వీరు లబ్ధప్రతిష్ఠులైన వ్యక్తులు. సాయిబాబాకు సన్నిహితులు, మరికొందరి నుండి వారి వారి అనుభవములను వారు తెల్పగా రికార్డు చేసుకుంటున్నారు. వందల కొలది భక్తులను ప్రశ్నించి వారి అభిప్రాయాల్ని రికార్డు చేయు చున్నారు. చలన చిత్ర కెమేరాలతో వీరు బాబా తటాలున సృజించి వస్తువులను ఇచ్చుట చిత్రీకరించినారు. ఒక్క విషయమున తెల్పవలెనంటే వీరు సాయిబాబా వద్దగల మానవతాతీతశక్తులను తిరుగులేని సాక్ష్యాధారములచే భద్రపరచియున్నారు.

**బాబాతో ముఖాముఖీ :**

మొత్తం ఎనిమిది మంది సభ్యులుగల మా బృందాన్ని విడివిడిగా కూర్చుండబెట్టారు. పైన పేర్కొనిన ఇద్దరు పారాసైకాలజిస్టులు కాక తదితరులు ఒకరు లాస్ ఆంజలిస్ నుండి, ఒక స్త్రీ శ్రీలంక నుండి, ఒకరు హాంకాంగ్ నుండి, ఒక డాక్టరు బొంబాయి నుంచి వచ్చినవారు ఉన్నారు, అక్కడ.

త్వరలోనే 10x10 అడుగుల వైశాల్యముగల గదిలోనికి మమ్ములను ఆహ్వానించారు. బాబాకు ఎదురుగ చతికిలబడి కూర్చున్నాము. అయన కూడా వెనుకనే ఉన్న సింహాసనము మీద కాకుండ, మా ముందు చతికిలబడి కూర్చొన్నారు. మేము రాగానే మమ్ములను ఆహ్వానించుటయా అన్నట్లు బాబా కుడిచేయిపైకెత్తి ఒక్కసారి ఊపి, విభూతిని సృష్టించి దానిని మా బృందమున గలవారి కొందరకు పంచి ఇచ్చినారు.

ప్రశాంతతతో, నిర్మల హృదయముతో బాబా మమ్ములను ఆ లోతైన కండ్లతో, దరహాస వదనమున మమ్ములను వీక్షించినారు. నాకు వారిని నాలుగు అడుగుల దూరము నుండి చూచెడి భాగ్యము కల్గినది. చాల సుందరుడగను, యౌవనశీలిగను నాకు కన్పించినారు. ఉత్సాహము, తేజము, మందస్మితవదనము నేను వారిలో చూచినాను. భక్త సమూహము నందు వారు రీవిగ, ముభావముగ కన్పడినటులగాక, ఇచట వారు చిన్నపిల్ల వానివలె చక్కని మాటలతో, తీయని సంభాషణలతో, సహజముగ పెదవుల నుండి దొరలిన పదములతో మాట్లాడినారు.

వారి ఆతిధ్యమునకు మేమెంతో ఆనందపరవశులమై హాయిగా కూర్చుండియున్నాము. ఒక్క క్షణము నేను ఒక మహాత్ముని సమీక్షణమున ఎదురు బొదురుగా కూర్చుండియున్నాననెడి భావము మటుమాయమైనది. ఈ యుగమున కోట్లాది ప్రజలను భారతదేశమున, విదేశములందును ప్రభావితము చేయుచున్న మహనీయుని సన్నిధానమున ఉన్నానను విషయము మరచిపోయెడు స్థితిని బడసినాను.

*(రాబోవు సంచికలో అమెరికన్ దంపతులు వేదవిధానమున వివాహము గావింపబడు విషయము తెలుపబడును.)*

*

# దేవీ వినుతి వీణ

నీతాటంకపు మహిమో
పేతమున కదా! శివుండు విషమా నియునా
రీతిని, "మృత్యుంజయు"డై
ఖ్యాతినిఁజెందుట నిజమిది కాదా! దేవీ!

ఒకొక్క చిహ్నాయయ్యది
యొక్కొక్క శక్తినిడి జీవ మొసగును పతికిన్
నిక్కముగ సతీపతులన
నొక్కరు గాకిర్వురగుదె? యుర్వినిదేవీ !

పరిణయమున 'సప్తపది'ని
నెవపెడుతరినేడు పొర్లు మృదుపదమున్
హరుడెత్తి 'సన్నె' బెట్టిన
పిరియెంతనినన్నుతింతు శ్రీ శివ! దేవీ!

మంగళ గౌరీ ! దివ్యసు
మంగళి! లలితాంగి సర్వమంగళయనుచున్
మంగళహారతి బట్టెద
మంగళముల నెల్లనిమ్మ మాతా! దేవీ!

ధరశిల గిరికెక్కింపగ
తరమా? యతడెంతటి బలదర్పుడుగానీ
స్థిరముక్తి పదముఁజేర్పగ
తరమా? గురువునకు విషయదాసుని దేవీ!

పితయై దక్షుఁడహంకృతి
పతినీ, నినున్ సవనశాలఁబడదిట్టిన నికనీ
వతనికి సుతఁగానని యా
హుతియై సాధ్వియనగఁబేరు నొందవె? దేవీ!

— పృథివి

# శ్రీవాణి జీవిత సభ్యులు



శ్రీమతి కస్తూరి లక్ష్మీ కుమారి
శ్రీ కస్తూరి గోపాలరావు
విజయవాడ



Sri A.S. Murthy
Smt. A. Savitramma
Dusi, Srikakulam Dist.



Sri P.S. Prasad
Manikyapuram
Srikakulam Dist.

## శ్రీవాణి సాంస్కృతిక మాసపత్రిక

### (Form IV See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రచురణ స్థలము | : | మచిలీపట్నం |
| 2. | ప్రచురణ ఎన్నాళ్ళకు | : | మాసమునకు |
| 3. | ముద్రాపకుని పేరు | : | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 4. | ప్రచురణ కర్త పేరు | : | కొమరిగిరి కృష్ణమోహనరావు |
| 5. | సంపాదకుని పేరు | : | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 6. | చిరునామా | : | 24-52, రామానాయుడుపేట, మచిలీపట్నం |
| 7. | ముద్రణాలయము | : | శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ |
| 8. | భాగస్థులు | : | ఎవరూ లేరు |

కొమరగిరి కృష్ణమోహనరావు అనే నేను పై విషయములన్నియు యదార్థమని తెలుపుచున్నాను.

కొమరగిరి కృష్ణమోహనరావు
ప్రచురణకర్త సంతకం

మచిలీపట్నం
21-2-1998



# శ్రీ శివసాయి రియల్ ఎస్టేట్స్

కరెంటు ట్రాన్స్‌ఫారం దగ్గర, బస్సుస్టాండ్ ప్రక్కన

**పుట్టపర్తి - 515 134**

*ప్రశాంతి నిలయం S.S. హాస్పిటల్, M.R.O. ఆఫీస్,*
*గోకులం దగ్గరలో గల ప్లాట్స్, అపార్టుమెంట్స్, ఫారం లాండ్స్ అమ్మకము*
*మరియు కొనుగోలుకు సంప్రదించండి.*

***ఒక్కసారి రూ. 10,116/- లు చెల్లించిన 10 సంవత్సరముల వరకు ప్రతి సంవత్సరమునకు 60 రోజుల వంతున డోర్ నెం. 324, కుమార్ విలాస్ పై రెండు అంతస్తులు, గోపురంగేటు ప్రక్కన, గోపురంరోడ్ వద్ద ఉచిత వసతి సౌకర్యము లభించగలదు.***



**శివసాయి అకామిడేషన్స్ ప్రారంభించబడినది.**

**వాయిదా పద్ధతిలో ప్లాట్లు మరియు అపార్ట్‌మెంట్లు కూడా లభించును.**

ప్రొప్రయిటర్స్ :

గ్రంధి యుగంధర్, చుండూరి వెంకటేశ్వరరావు B.A.,